

Chandamama, July '52

Photo by N. Ramakrishna

త్వరలో రానున్నది!

# కినిమా

(సినిమా మాస పత్రిక)



పత్రికా ప్రచురణలో నూతనాధ్యాయం ప్రారంభించిన

## చందమామ పబ్లికేషన్స్

నుంచి

ఈ మాసపత్రిక

అందమైన ఫొటోలతో, ఆకర్షవంతమైన శీర్షికలతో,
ముచ్చటైన ముద్రణతో సర్వాంగసుందరంగా వెలువడి

సినిమా పాఠకలోకాన్ని
రంజింపజేయనున్నది

తొలిసంచికకోసం వేచివుండండి

---

## చందమామ పబ్లికేషన్స్

వడపళని :: మదరాసు - 26.



## ఈ సంచికలో యివి చదువుకోండి



ఇవన్నీ గాక ఇంద్రజాలం, ఒంటిగీత బొమ్మ,
ఆకర్షవంతమైన మరికొన్ని క్రొత్తశీర్షికలు వున్నై.




రాగిణీ వారి

# ధర్మదేవత

శాంతకుమారి · లలిత · గిరిజ · రంగమూర్తి · ముక్కామల · బి.యస్.ఆర్.
రేలంగి · రామమూర్తి · వంగర · లక్ష్మీప్రభ · పద్మిని · బాలసరస్వతి · మాస్టర్ మోహన్.

డిస్ట్రిబ్యూటర్సు.
ఆంధ్ర. రాజశ్రీ
మైసూర్. తల్లం

# అడ్రసు మార్పు....



మీరు యికమీదట మాకువ్రాసే లేఖలపైన

## చందమామ పబ్లికేషన్స్

2 & 3 ఆర్కాట్ రోడ్, వడపళని, మదరాసు - 26.

అని వ్రాయవలసినదని మనవి. ఇది పోష్టాఫీసు మార్పుతప్ప వేరుగాదు.

త్వరలో వస్తున్నది



ఈస్టిండియా ఫిలిం కంపెనీ వారి

# సంక్రాంతి

డైరెక్టర్ :
సి. పుల్లయ్య



త్వరలో రానున్నది!

విజయ వారి

# చంద్రహారం

డైరెక్షన్: కె. కామేశ్వరరావు, బి. ఏ. :: నిర్మాతలు: నాగిరెడ్డి & చక్రపాణి

# చందమామ

సంచాలకుడు :: చక్రపాణి

సంపుటి 11 : జూలై 1952 : సంచిక 1

చందమామ ప్రారంభించి అయిదేండ్లు పూర్తి అయినై. ఈ సంచికతో ఆరవ ఏడు ప్రారంభమవుతూ వుంది. ఈ శుభసందర్భంలో ఉత్సాహంగొలిపే కొన్ని కొత్తశీర్షికలూ, పోటీలూ ప్రవేశపెడుతున్నాము. ఇప్పటి వరకు భాగవతంలోని రసవత్తర ఘట్టాలను మూడు రంగుల ముఖచిత్రంగా అందుకుంటూవచ్చిన మా పాఠకులు ఇంతటినుంచి మహాభారతగాథలలోని మహత్తరఘట్టాలను అందుకొంటారు. తరువాత, 'రంగుల బొమ్మ కథ' అనే శీర్షికక్రింద మరొక ముచ్చటైన కథ ప్రారంభిస్తున్నాం. ఇవిగాక, 'ఫోటో వ్యాఖ్యలపోటీ' అనే క్రొత్తపోటీ ఒకటి ఇప్పుడు ప్రారంభించబడింది. పాఠకులు ఉత్సాహంతో ఈ పోటీలో పాల్గొంటారని ఆశిస్తున్నాం. ఇవిగాక వచ్చే సంచికలో, ఆనందమునిచ్చే మరికొన్ని శీర్షికలు చేర్చటానికి ఏర్పాటుచేస్తున్నాము. పోటీలో పాల్గొనేవారికి తోడ్పడాలెననే వుద్దేశంతో కొత్తశీర్షికలనుగూర్చిన వివరాలుకూడా ఈ సంచికలోనే ప్రకటించాం.



# మాటలు-చేతలు





రాముడు చాలా బుద్ధిమంతుడని
పెద్దలు తలచేవారు.
నిజము తెలుసుకోవాలనుకుంటే
అతనిని పిలిచేవారు.

ఒకరోజతని మిత్రులొక తోటను
దోచా లనుకున్నారు.
'నీవుకూడ వస్తావా' అని వా
రాతనితో అన్నారు.

'వద్దు వద్దు, అయ్యయ్యో! పాపం!
తోటవాడు కడుపేద.
పిల్లా జల్లా కలరతనికి, దయ
చూపం డాతనిమీద.'

అని రాముడు తన తోటి బాలురకు
నీతులు బోధించాడు.
వారి మనస్సులు మరలించాలని
ఎంతో యత్నించాడు.

కాని వారు—'పోరా, నీఖర్మం!
తీయని మామిడిపళ్ళు
ప్రాప్తంలేవు నీకు కాబోల'ని
త్రొక్కినారు పరవళ్ళు.

రాముడు నిలబడ్డా డూరకనే
పోయేవారిని చూస్తూ.
పండిన మామిడి తీపి తలచుకొని
తీరని గుటకలు వేస్తూ.

వారు అలా పొయ్యారో లేదో
ఉస్సురుమన్నది ప్రాణం.
మంచిఛాన్సు పోయిందని అతనికి
కలిగిం దొక అనుమానం.

'నే వెళ్ళకపోతేమాత్రం, ఆ
పళ్ళు మిగిలివుంటాయా?
తప్పదు చేటు తోటకెట్లో, ఈ
కోతు లూరుకుంటాయా?'

'కొంత నయం నే పోతే, పిందెల
నైనా మిగల్చవచ్చు.
కొమ్మలు, రెమ్మలు త్రుంచేయొద్దని
వారిని అదల్చవచ్చు.'

అనుకొని వెనువెంటనే తోటలో
కొక్క పరుగు తీశాడు.
అందరితోపాటే మన రాముడు
పళ్ళు తనూ కోశాడు.

పిల్లలు కొంచెం గేలిచేసినా
అతడు సరకుగొనలేదు.
'నేను తప్పు చేశాన'ని మాత్రం
నోటివెంట అనలేదు.

నీతులు చెపటం చాలాతేలిక,
ఆచరించటం కష్టం.
చెప్పినదానిని చేయకపోతే
నిజాయితీకే నష్టం.





రచన: "బైరాగి"



1



2



3



4



5



6



7



8



9

ఇక్కడ తొమ్మిది బొమ్మలున్నవి. వీటిల్లో ప్రతి బొమ్మలోనూ మా చిత్రకారుడు ఒక్కొక్క విధమైన తప్పు చేసివున్నాడు. ఆ తప్పులేమిటో మీరు పట్టగలరా?

సరిఅయిన జవాబులకు వచ్చేనెల చందమామ చూడండి.




క్రాటేనికోనలో కామయ్య అనే ఒక కమ్మరి ఉండేవాడు. అతడు కత్తులు, కొడవళ్లు, గునపాలూ, పారలూ—ఇటువంటి ఇనుప సామగ్రి అంతా తన దుకాణంలో తయారు చేసేవాడు.

ఇనుముతో సరుకు తయారుచెయ్యటమంటే సులభంకాదు. మండే కొలిమిని గాలితిత్తులతో ఊదాలి. ఇనుమును బాగా ఎర్రగా కాల్చాలి. అలా కాలినదాన్ని చల్లారిపోకుండా దిమ్మమీదపెట్టి, సమ్మెటతో బాదాలి. సమ్మెటతో బాదటానికి మాంచి జబ్బపుష్టి కావాలి. కామయ్యకి జబ్బపుష్టీ ఉంది; చెమటోడ్చి పనిచేసి డబ్బు సంపాదించుకోవాలన్న ఆసక్తీ వుంది.

కామయ్య కొడుకు సోమయ్య. వాడు ఉత్త సోమరిపోతుగా తయారయాడు. ఇందుకు కారణం వాడితల్లి శేషమ్మే. శేషమ్మకి కొడుకు కొలిమిముందు కూర్చుని కష్టపడటం ఇష్టంలేదు. మేనమామకి మల్లేనే తన కుమారుడుకూడా యేదైనా ఒక ఉద్యోగం చెయ్యాలిగాని కొలిమిదగ్గిరకే పోకూడదని ఆమె ఉద్దేశం. ఈ వుద్దేశంతో పలకా పుస్తకాలూ కొనిచ్చి, వాడిని బళ్లోకి పంపించింది.

కామయ్యకి ఇదేమీ నచ్చలేదు. కులవృత్తి చెయ్యకపోవటం తనకూ లోకానికీ కూడా చెరుపేనని అతడి వుద్దేశం. ఐనా భార్యమాటకు యెదురాడలేదు.

సోమయ్య బళ్లోకయితే వెళ్లివచ్చేవాడు గాని, వాడికి చదువేమీ అబ్బలేదు. 'పోనీ, కొలిమితిత్తివద్ద కూచుని గాలయినా పొయ్యరాదురా అబ్బాయీ!' అని మందలించేవాడు కామయ్య. కాని కూచుని పనిచేయటంకన్న రోడ్లమ్మట తిరగటమే సరదాగా కనపడి, సోమయ్య తండ్రి కంట పడటమే మానివేశాడు.

ఎస్. వేణుగోపాల్ - పర్లాకిమిడి



కామయ్య్య క్రమంగా పెద్దవాడైనాడు, జవసత్తువలు ఉడిగినై. 'నాతర్వాత ఈ దుకాణం మూసెయ్యవలసిందేనా?' అని పించి, చింతించాడు. 'నేను సంపాదించిన దంతా నాకొడుకు మూడుపూటల్లో తగలెట్టేస్తాడు. తర్వాత అడుక్కుతినటమేనా గతి?' అని వాపోయాడు.

భార్యను పిలిచి, 'మనవాడిని రెంటికీ చెడ్డ రేవడుగా చేశావు! ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకోమను. కులవృత్తి నేర్చుకోమను' అని మళ్ళీ చెప్పిచూశాడు. 'తొందరపడకయ్యా. వాడూ ఊరికే వుండలేదు. ఏదో ఉద్యోగంకోసం వెతుకులాడుతూనేవున్నాడు'



అంది శేషమ్మ కొడుకుమీది గారంకొద్దీ. కామయ్యకి వొళ్ళు మండింది. 'ఏమిటీ? ఉద్యోగమా! వాడికీ నీకూకూడా కష్టార్జితం అంటే ఏమిటో తెలియకుండాపోతోంది. నేను సంపాదించినదానితో తర్వాత కులుకుదామనుకుంటున్నాడు కామోసు! నాస్వార్జితంలో చిల్లిగవ్వకూడా వాడికి ముట్టనివ్వను, యేమనుకున్నావో! పని నేర్చింది మొదలు ఈనాటివరకూ నేను రోజూ మూడు రూపాయలైనా కళ్లచూడందే దుకాణం ముయ్యలేదే. వీణ్ణి, మూడు రూపాయలు కాదు, మూడు పావలాలు సంపాదించమను చూద్దాం!' అన్నాడు ఆవేశం ఉట్టిపడుతూ.

అంతట్లోకి సోమయ్య్య వచ్చాడు. వాడితో శేషమ్మ, 'ఏమిరా నానిగా! మీబాబు నిన్ను ఉత్తి చవటగా కట్టేశాడు చూశావ్రా. మూడు పావలాలైనా సంపాదించలేవుట నువ్వు!' అంది. సోమయ్య్య, 'ఓస్, అదెంత? చిటికెలో గడించుకొస్తా'నన్నాడు.

సోమయ్య్య వెళ్ళేడు. కాని వాడికి సంపాదనంటే యేదో తెలుస్తేగా? పావలా కాసులు చెట్టుకి కాస్తాయా యేమన్నానా, కోసుకు చక్కారావటానికి? మూడు ఝాములదాకా



అక్కడా అక్కడా తిరిగివచ్చి, 'అమ్మా, తలనొప్పిగా వుందే ఎండనిబడి తిరిగొస్తేను' అన్నాడు. 'ఏమైనా గడించావుట్రా బాబిగా' అంది శేషమ్మ. 'లేదు. భోంచేసి వెడతాలే మళ్ళీ' అన్నాడు సోమయ్య.

భోజనంచేసి పడుకుని సాయంత్రం దాకా నిద్రపోయాడు. తండ్రి దుకాణం మీంచి వచ్చి 'మూడు పావలాలూ ఏవిరా?' అంటే యేమిటి చెప్పడం? వాడికి తటాల్న ఒక ఆలోచన తట్టింది. 'అమ్మా, రేపు సంపాదిస్తాను. ఇవేళమట్టుకి నా మూడు పావలాలూ నువ్వియ్యే' అన్నాడు. తండ్రి ముందు పసివాడు నవ్వులపాలు ఐపోతాడేమోనని శేషమ్మ గదులపెట్టెలోంచి మూడు పావలా కాసులు తెచ్చి యిచ్చింది.

కామయ్య చీకటిపడేవరకూ దుకాణంలో పనిచేసి ఇంటికొచ్చాడు. సోమయ్య డాబుగా జేబులోంచి మూడు పావులాలూ తీసి తండ్రిచేతిలో పడేసి, 'చూస్కో!' అన్నాడు. కామయ్య, ఆ మూడు పావలా కాసుల్నీ ఒకమాటు అటూ ఇటూ తిరగేసి, 'ఎక్కడివిరా అబ్బీ ఇవి?' అని అడిగాడు. 'ఎక్కడివేమిటి? పొద్దస్తమానం ఎద్దులా పనిచేసి సంపాదిస్తేను?' అని దబాయించాడు సోమయ్య. 'ఇది నీ కష్టార్జితంకాదు' అంటూ ఆ మూడుపావలాలూ మండుతోన్న పొయ్యిలోకి విసిరేశాడు కామయ్య.




మర్నాడు శేషమ్మ సోమయ్యతో 'ఇవాళైనా గడించుకురారా' అంది. వాడానాడు తల్లికి తెలవకుండానే ఒక రూపాయి గదుల పెట్టెలోంచి తీసుకుపోయి మిఠాయి దుకాణంమీద మార్చి, పావలా పకోడీలకీ జీడిపప్పు పాకానికీ ఖర్చుపెట్టి మిగత ముప్పావులా తెచ్చి, 'సంపాదించా'నంటూ రాత్రి తండ్రి చేతిలో పడేశాడు. క్రిందటిరోజుకు మల్లేనే తండ్రి ఆ మూడుపావులా కాసులూ తిరగేసి మరగేసి 'ఇదీ నీకష్టార్జితంకాదు.

నన్ను మోసగించబోకు' అంటూ వాటిని కూడా పొయ్యిలోకి విసిరేశాడు.

మూడోనాడు సోమయ్యకి గదులపెట్టెలో ఏమీ చిక్కలేదు. అంతేకాకుండా తనది కష్టార్జితంకాదని తండ్రికి తెలిసిపోతోంది కూడాను. నిజంగా గడించి తేవాలని వాడు నిశ్చయించాడు. కాశీనికోనలో శనివారం సంత. వాడు సంతకుపోయి, మూటా ముల్లె మోసి కూలిడబ్బులు అర్జించటం ప్రారంభించాడు. చీకటిపడేదాకా మోసినా పావలా పోగవలేదు. మర్నాడు బళ్లఘాటీపద్దకు పోయి పెట్టెబేడా ఊళ్ళోకి మోసుకుపోవటానికి ఒప్పుకొని డబ్బు గడించాడు. బలమైనవాడే ఐనా సోమయ్యకి శ్రమపడటం అలవాటులేదు గనక పెట్టెలు మొయ్యటమంటే కష్టమే అనిపించింది. కాని పట్టుదలతో పనిచేశాడు. ఐతేం, రోజంతామోస్తే అరణాలకన్న ఎక్కువ కిట్టలేదు. మర్నాడు కూడా మోస్తేగాని ముప్పావలా కూడలేదు.

ముప్పావలా పోగవటంతోనే సోమయ్య తండ్రి చేతులో వేశాడు. కామయ్య యథాప్రకారం 'ఇదీ నీకష్టార్జితం కా'దంటూ పొయ్యిలోకి విసిరేశాడు. కాని ఈమాటు సోమయ్య ఇదివరలోమోస్తరుగా చూస్తోవూరుకోక పరుగెత్తివెళ్లి పొయ్యిలోంచి పావలాకాసుల్ని గబగబా పైకి లాగేడు.

కామయ్య చిరునవ్వుతో 'అబ్బాయీ! ఇదీ నీకష్టార్జితం. యింతకుముందు రెండుసార్లు సొమ్ము పొయ్యిలో పారేస్తే నీకు రవంతైనా బాధించలేదు. ఎంచేత? అది నీకష్టార్జితంకాదు గనక! కష్టార్జితమైన సొమ్ముమీద ఇలాగే మమకారం వుంటుంది. ఎవడో గడించి ఇస్తే దాని విలువ తెలీదు. కనుక యెవడిమానాన వాడు కష్టపడి గడించుకోవాలి అన్నాడు. 'నిజమే నాన్నా' అన్నాడు సోమయ్య. అర్జన విలువ తెలిసిన సోమయ్య కష్టపడి ప్రయోజకుడై, తలిదండ్రులను సంతోషపెట్టి, తనుసుఖపడ్డాడు.






# 7

[తను పంపిన వైద్యుడూ, అతని పరివారమూ ఎంతకాలానికీ తిరిగి రాకపోయే సరికి, శక్తిసింహుడు స్వయంగా మంత్రిని పట్టాలని దీక్షబూని బయలుదేరటం, ఒకానొక మహారణ్యమధ్యంలో ఒక కుర్రవాడు కనుపించగా, కెవ్వున కేకవేసి ఆ కుర్రవానిని పట్టబోవటంవరకూ చదివారుకదూ ? ఆ తర్వాత—]

శక్తిసింహుడికి కనుపించిన ఆ కుర్రవాడు మరెవరో కాదు, దేవసింహుడే! తన మాయ దొప్పలో అలా అలా తిరుగుతూ ఆ అరణ్యం లోకి రావటం సంభవించింది. అయితే, శక్తిసింహుడైనా ఆ కుర్రవాడు దేవసింహుడేనని పూర్తిగా ఆనవాలుకట్టలేదు. కాని, చూచీ చూడటంతోనే దేవసింహుడే ఐవుంటాడేమో నన్న అనుమానం కలగటంచేతనే అలా కెవ్వున కేకవేసి వానిని పట్టబోయాడు. ఇంతకూ దేవసింహుడు దొరకనేలేదు. మహిమగల ఆ విమానంమీద అతడు రివ్వున ఎగిరిపోయాడు.

ఇక్కడ శక్తిసింహుడి సంగతి, అక్కడ మంత్రి, ఆస్థానవైద్యుడి సంగతి అటుంచి దేవసింహుడి చిత్రచరిత్ర చూదాం :

ఇంతకాలంగా దేవసింహుడు తన విమానంలో బయటకు వచ్చినా భవనం చూపుమేర దూరంలో కనబడేటంత దూరం వరకు మాత్రమే వెళ్లేవాడు. కాని ఆ పైకి వెళ్ళేందుకు సాహసించేవాడుకాడు. కాని ఎప్పుడైతే తన భవనంలోకి కొత్తమనుషులు వచ్చారో, అనాటినుంచీ తన స్వేచ్ఛ ఎంతో తగ్గిపోయినట్టు బాధపడసాగాడు. వాళ్ళు యెంతవరకూ భవనం వదలిపోవటం



17




కనబడకపోయేసరికి నిరాశచెందాడు. ఇంతకంటే ఆ విమానంలో అలా ప్రపంచమంతా చుట్టిరావటమే బాగుండేటట్టుందనుకొన్నాడు. అనుకొని, ఈపర్యాయం భవనం వదలి ఎన్నోప్రదేశాలు దాటుకొంటూ చాలదూరం వచ్చేశాడు. అప్పటికి మూడు రోజులైంది అతను భవనం వదలి వచ్చేసి. అయినా అలా తిరుగుతూ వుండటం సుఖంగానే తోచింది. అయితే ఆ సుఖం—అట్టే కాలం నిలవలేదు.

దేవసింహుడు ఆకాశంలో చాలాఎత్తున వెళుతున్నాడు. అకస్మాత్తుగా కారుచీకట్లు కమ్ముకొచ్చి, కొద్దికొద్దిగా వానతుంపరలు



కూడా ప్రారంభమైనై. ఏమిటిచెయ్యటం? తడిసిపోక తప్పేట్టులేదు. పోనీ, తిరిగి భవనం చేరుకుందామన్నా మరో మూడు రోజులకు కాని చేరుకోలేడాయె. అలో చిస్తూన్నంతలోనే వర్షం పెద్దదై, పాపం దేవసింహుడు తడిసిపోయాడు. అయితే చిత్రం! అంత వర్షం కురుస్తున్నా ఆ దొప్పలో ఒక్క నీటిబొట్టుకూడా నిలవలేదు.

తడిసిపోయిన దేవసింహుడు చలికి గజ గజ వణికిపోసాగాడు. 'ఈసమయంలో కంబళిఅయినా వుంటే బాగుండిపోనుకదా' అనుకొన్నాడు.

అతడిలా అనుకోవటమేమిటి, ఒక మెత్తటి ఉన్నిముసుగు వచ్చి వంటిని కప్పివెయ్యటమేమిటి, ఒకేమారు జరిగింది. దేవసింహుడి ఆశ్చర్యానికి అంతులేదు. తన అదృష్టానికి మురిసిపోతూ, ఆ ఉన్నిముసుగు ఒళ్లంతా కప్పుకొని 'ఇకనైనా ఇంటిముఖం పట్టకపోతే మాట దక్కదు' అనుకుంటూ "అబ్రకడబ్రా, టుమ్‌టుమ్‌టీ" అన్నాడు.

ఎప్పుడైతే దేవసింహుడి నోటినుంచి ఈ మాటలు వెలువడినయ్యో, పోతూపోతూ వున్న విమానం టక్కీమని ఆగింది. ఆగి, గిరుక్కున తిరుగుముఖంపట్టి మళ్లీ వేగంగా



పోసాగింది. ఇక ఫరవాలేదనుకొంటూ దేవసింహుడు, ముసుగు కప్పుకొని దొప్పలోనే వెచ్చగా పడుకొన్నాడు.

కాని అలా ఎంతోసేపు పడుకోలేక పోయాడు. ఎందుచేతనంటే మరికొద్దిసేపటికల్లా వర్షం పూర్తిగా తగ్గిపోయి, మళ్ళీ ఫెళ ఫెళమని ఎండ కాయటం మొదలుపెట్టింది. చలిగా వున్నప్పుడేగాని, ఎండగా వున్నప్పుడు కంబళి ఏం సుఖం? దేవసింహుడి ఒళ్ళు ముచ్చెమటలుపోసింది. "ఇక ఈకంబళితో పనిలేదు" అని దానిని కిందకు విసిరివేశాడు.



సరీగా అదే సమయంలో ఒక గొర్రెల కాపరి అటు వెళుతూ వుండటం, దేవసింహుడు విసిరివేసిన కంబళి వాడికి దొరకటం సంభవించింది. వాడు ఆశ్చర్యపోతూ తలెత్తిపైకి చూచేసరికి దేవసింహుడు అప్పటికప్పుడే చాలదూరం దాటిపోయాడు. గొర్రెలకాపరి కంబళి బుజాన వేసుకొని మురిసిపోతూ తనదారిన వెళ్లిపోయాడు.

మరికొద్దిసేపటికి దేవసింహుడికి అమిత దాహంవేసింది. అయితే, నడిఆకాశంలో సంచరిస్తున్న సమయంలో నీళ్ళెక్కడినుండి వస్తయ్! అప్పటికే చాలసేపటినుంచి వుగ్గబట్టుకొని వున్నాడు. కాని యిక వుండలేకపోయాడు. "నాలుక పీక్కుపోతోంది. భవనం చేరటానికి ఎలాలేదన్నా యింకో రోజు గడవాలి. అప్పటివరకూ యిలా దాహంతో నాలిక ఎండిపోవలసిందేనా?" అని పైకి నిట్టూర్చాడు.

ఎప్పుడైతే దేవసింహుడు ఇలా అన్నాడో, ఒక మైనాపిట్ట ఎక్కడినుండో చిన్నపాత్రను ముక్కున కరుచుకొచ్చి, దొప్పఅంచు పైన వాలింది. దేవసింహుడు ఆత్రంతో పాత్రలోకిచూచాడు. అది స్వచ్ఛమైన నీరు! తనను రక్షించటానికే ఆ మైనా వచ్చిందని గ్రహించాడు. పాత్రని తీసుకొని ఒక్క గుక్కలో తాగివేశాడు. కాని, చిత్రం! పాత్ర



ఖాళీకాలేదు సరిగదా తిరిగి నీటితో నిండి వుంది. ఆ నీళ్ళుకూడా మళ్లీ ఒకగ్రుక్కలో తాగేశాడు. అప్పటికీ ఖాళీకాలేదు. ఈ విచిత్రానికి ఆశ్చర్యపోతూ, దేవసింహుడు మైనాకు తన కృతజ్ఞత తెలపాలని దానికోసం చూచాడు. కాని అది యెప్పుడు మాయమైందో యేమిటో కనుపించనేలేదు!

దేవసింహుడి ప్రాణాలు కుదుటబడినై. అనుకోనివిధంగా కష్టాలుకలిగినా, అవి ఏదోలాగా, దేవుని దయవల్ల తీరిపోయినందుకు ధైర్యంచెంది, దేవసింహుడు తన మాయవిమానంలో ముందుకుసాగాడు.

* * *

అక్కడ భవనంలో మంత్రీ, వైద్యుడూ ఎలావున్నారో చూదాం.

తలవనితలంపుగా దేవసింహుడి జాడ తెలిసిరావటమేగాక, వానిని కళ్ళారా చూడ గలిగాముకదా అని మురిసిపోయేటంతలో, దేవసింహుడు తమ కర్మానికి తమని అలా భవనంలో వదిలివెళ్లటం, వెళ్ళి అప్పటికి వారంరోజులైనా అంతూపొంతూ తెలియక పోవటం, మంత్రినీ ఆస్థానవైద్యుడినీ ఎంతో కంగారుపరచింది. పోనీ, తమ రాణీ దేవప్రియ అయినా కనుపిస్తుందేమో, సంగతులు వెల్లడి అవుతవికదా అనుకుంటే, అదీజరగ లేదు. సరిగదా, మరోపురుగు ఆ భవనంలోకి రానేలేదు. ఇదంతా అగమ్యగోచరంగా తోచింది. ఎన్నాళ్ళని యిలా భవనంలో కన్నులు కాయలు కాచేటట్లు కావలా కాయాలో తెలియలేదు. అయినా, గత్యంతరం లేక అలానే ఉండిపోయారు.

అలావుండగా ఒకనాటి వేకువజామున ఎవరో భవనందగ్గరలో సంచరిస్తున్న అలికిడి అయింది. మంత్రీ, వైద్యుడూ ఆశతో వెళ్లిచూచారు. అయితే వాళ్లకొండంత ఆశా నిరాశగా మారిపోయింది. ఎందుచేతనంటే అవచ్చినది ఎవరో కాదు, శక్తిసింహుడే!

అయితే అతను భవనంలో ప్రవేశించక గ్రుడ్డివానిలా తడుములాడుతూ భవనం చుట్టూతా పచార్లుచేస్తున్నాడు. ఇందుకు కారణం మంత్రి అయితే గ్రహించలేక పోయాడుగాని, వైద్యుడు యిట్టే గ్రహించి వేశాడు.

"అపూర్వమైన ఈ సౌధం ఏమిటో గాని దీనిలో మరో గొప్పచిత్రం వుంది. ఈభవనం కొందరికి కనుపించి, కొందరికి కనుపించకపోవటం ఏమిటో ఇంద్రజాలంగావున్నది. ఈచిత్రం మీరు కనిపెట్టారో లేదో!" అని ప్రశ్నపూర్వకంగా మంత్రివంక చూచాడు వైద్యుడు.

"అలాగనా" అని మంత్రి ఆశ్చర్యం కనబరిచాడు.

వారు యిలా మాట్లాడుకుంటూ తిరిగి శక్తిసింహుడికోసం చూచేసరికి అతడు అప్పటికప్పుడే వడివడిగా అడుగులువేసు కుంటూ భవనందాటి పోతూవున్నాడు. మంత్రికీ, వైద్యుడికీ యిది మరింత ఆశ్చర్యాన్ని కలిగించింది.

"ఇక్కడి కెలావచ్చాడో ఏమో, రానే వచ్చాడుకదా! ఏమీ తేల్చుకోకుండానే అలా ఎక్కడికి పోతున్నట్టుచెప్మా?" అని




ఒకరిముఖాలు ఒకరు చూచుకున్నారు. ఒక్కళ్ల ఊహకీ ఏమీ అందలేదు.

మరొక రెండురోజులు గడిచాయి. తిరిగి అదే వేకువజామున తిరిగి అలికిడి. అయితే ఈమారు పెద్దఅలజడి! మంత్రీ, వైద్యుడూ చరచర తమస్థానాల్లోంచి లేచివెళ్లి భవనం లోంచి తొంగిచూచారు.

భవనంచుట్టూతా వందలాది భటులు, గునపాలూ గొడ్డళ్ళూ పుచ్చుకొని భవనాన్ని పడగొట్టటానికి సిద్ధంగావున్నారు. ఒక గుఱ్ఱం మీద శక్తిసింహుడు కూర్చొని, కళ్లవెంట చింతనిప్పులు కక్కుతూ, "ఊఁ, చూస్తారేం! కానివ్వండి, సూర్యోదయానికల్లా ఈమాయ




ఏమిటో పటాపంచలై మట్టిపాలు కావాలి" అంటూ శాసిస్తున్నాడు.

మంత్రి వైద్యుడు గజగజలాడిపోయారు. ప్రాణాలు అరచేతులో బెట్టుకొని క్షణమొక యుగంగా గడుపుతున్నారు. అయితే అలా గుడ్లప్పగించి కూర్చోవటమేనా? శక్తి సింహుడు పట్టుపట్టాడంటే సాధించితీరుతా డన్నసంగతి వారికి పూర్తిగా తెలుసు. అందుచేత, కాలయాపనచేస్తే, మరికొద్ది సేపటిలో భవనం కూలటమూ, దానితోపాటు తాముకూడా మట్టిపాలపటమూ ఖాయమనీ తెలుసు. కనుక ఆలోచిస్తూ కూర్చోని లాభంలేదని తేల్చుకున్నారు. తెగించి భవనంలోంచి బయటపడుదామని సిద్ధపడి కదలబోయారు.

కాని, అంతలోనే ఒక చిత్రం జరిగింది. ఇన్నేండ్లుగా తామంతా ఏ వృద్ధురాలి కొరకైతే ఎదురు చూస్తూవున్నారో, అమె, ఎక్కనుండి వచ్చిందో ఏమో, సరీగా భవనం నెత్తిమీదికి ఎగిరివచ్చింది. వచ్చి ఏమిచేసిందో ఏమో! శక్తిసింహుడి పరివారం అంతా పక్షులుగా మారిపోయారు. మారి పోవటమే కాదు, చూస్తూవుండేటంతలో రివ్వున ఎగిరిపోయారు. శక్తిసింహుడు మాత్రం గుఱ్ఱం మీద ఒంటరిగా నిలిచి పోయాడు.

అంతా రెప్పపాటుకాలంలో జరిగి పోయింది.

మంత్రీ, వైద్యుడూ విస్తుపోతూ భవనం పైకి చూచారు, వృద్ధురాలు యింకా ఏమి వింతలు చేస్తుందో చూతామని. కాని ఏదీ వృద్ధురాలు? తను వచ్చినపని అయిపోయిం దన్నట్టుగా, అమె ఎప్పుడు మాయమైందో కాని, అచుట్టుప్రక్కల ఎక్కడా కనుపిం చనేలేదు.

శక్తిసింహుడు కోపంతో నిలువునా మండిపోతున్నాడు.

"నేను యింతా శ్రమపడితే చివరకి యిదా ఫలితం? కథ అడ్డం తిరిగిందే! ఈ వృద్ధురాలి మాయల ముందు మన పరాక్రమం ఎందుకూ పనికివచ్చేట్టు కన బడటంలేదే! నాకు దారిలేదా?" అని తనని తానే ప్రశ్నించుకోసాగాడు శక్తిసింహుడు.

కొంతసేపు మథనపడి, ప్రాణం విసి గెత్తిందోయేమో, శరవేగాన ఆచోటు విడిచి వెళ్ళిపోయాడు.

మంత్రికీ, వైద్యుడికీ ప్రాణాలు కుదుట బడినై. "హమ్మయ్యా. ఇప్పటికి గండం గడిచినట్టే!" అని ధైర్యంచెందేటంతలో మరొకచిత్రం జరిగింది.

హఠాత్తుగా పెద్ద భూకంపం వచ్చినంత పనిజరిగి, భవనం ఊగులాడుతున్నట్టు తోచింది. మరుక్షణంలో బ్రహ్మాండమైన మోత వినవచ్చింది. ఏమిటా ఈ విపరీతం? అని యోచిస్తుండగా, భవనం నామరూపాలు లేకుండా మాయమైంది. మాయమవటమే కాదు, అంతకుముందు అక్కడ ఒక భవనం నిలిచివున్న ఆనవాళ్లయినా లేకుండా పోయి ఆ ప్రదేశమంతా పెద్ద ఎడారిలా మారిపోయింది. ఆ ఎడారి మధ్యంలో మంత్రీ, వైద్యుడూమాత్రం మిగిలారు.



ఇప్పుడీ అవాంతరంతో మంత్రికీ వైద్యుడికీ మతిపోయినట్టయింది.

"ఇక జరగవలసినపని ఏమిటి? తలవనితలంపుగా ఇటువంటి అవాంతరం వచ్చిపడిందే! 'ఇప్పటికి వెళ్ళాడుకదా, యిక ఫరవాలేదు' అని మనం యేమరు పాటుగా వుండటానికి వీలులేదు. మళ్ళీ తప్పకవస్తాడు. ఈసారి రావటమే జరిగితే మన అంతుతేల్చితీరుతాడు. కనుక మనం యిక ఈ నిర్జనప్రదేశంలో వుండటం శ్రేయస్కరంకాదు. ప్రస్తుతానికి, కొద్దిరోజుల పాటు మరెక్కడైనా తలదాచుకుని, ఆ తర్వాత రావటం మంచిదిగా తోస్తోంది.

ఏమిటీ మీసలహా?" అని వైద్యుడిని సలహా అడిగాడు మంత్రి.

"ఎంతో ధైర్యశాలురైన మీరే యిలా అధైర్యపడితే ఎలాగ? మనం వచ్చినపని యింతవరకు ఏమీ కానేలేదాయె. దేవసింహుడు ఏమయ్యాడో తెలియకనేపోయె. తొందరపడి మనం ఇక్కడినుండి వెళ్లటం ఏమంత సబబుగా తోచదు. అదీగాక ఎక్కడికని వెళ్ళేటట్లు? ఇక్కడనే వుండి యింకా ఏమేమిచిత్రాలు జరుగుతాయో చూదాం" అన్నాడు వైద్యుడు. సరేనన్నాడు మంత్రి. అందుచేత వాళ్ళు అక్కడనే వుండి, దేవసింహుడుగానీ, వృద్ధురాలుగానీ వస్తారేమోనని ఎదురుచూడసాగారు.

శక్తిసింహుడు వెళ్లివెళ్లి ఒక పర్వతశ్రేణి చేరుకున్నాడు. కష్టాలుపడి ఒక్కొక్క పర్వతమే దాటుతున్నాడు. చిట్టచివరి పర్వతం దాటుతున్నాడు. అయితే, ఆ పర్వతం వెళ్లివెళ్లి ఒక అగాధపు లోయ అంచున ఆగిపోయింది. లోయకు అవతలివైపు మరొక బ్రహ్మాండమైన పర్వతమూ, ఆ పర్వతంకొసని చిత్రమైన ఒక దేవాలయమూ కనుపించినై.

ఎలాగైనా అవతలి గట్టు చేరుకొని ఆ ఆలయమేమిటో తెలుసుకోగలిగితే బాగుండును అని అనుకున్నాడు అతడు. కాని నడుమనున్న ఈ అగాధపులోయ దాటటం ఎలా? అడుగు జారిందా అధోగతే! అయితే ధైర్యసాహసాలకూ, ఓరిమికీ పెట్టింది పేరాయె శక్తిసింహుడంటే. అంతమాత్రనికి వెనుకంజ వేస్తాడా? ప్రాణాలకు తెగించి లోయ దాటేందుకు సిద్ధపడ్డాడు.

---

[పర్వతంపైని ఆ దేవాలయమేమిటి? ఇంతకూ దేవసింహుడు ఏమైనాడు? దేవప్రియ కూడా బ్రతికేవున్నదా? ఎడారిలాంటి ఆ ప్రదేశంలో మిగిలివున్న మంత్రీ, వైద్యుడూ ఏమవుతారు? ఇవీ, మరికొన్ని చిత్రాలూ వచ్చేనెల చదవండి.]





# నమస్కారం

శ్యామలాపురం హైస్కూలులో హెడ్‌మాష్టరు రిటైరుకావటంచేత ఆ పదవి ఖాళీ ఐంది. హెడ్‌మాష్టరు పదవి ఖాళీ ఐనప్పుడు ఆ ఉద్యోగాన్ని సాధారణంగా తర్వాత పనిచేసే ఫస్టు అసిస్టెంటుకి ఇస్తారు.

శ్యామలాపురం హైస్కూల్లో ఫస్టు అసిస్టెంటుగా పనిచేస్తూన్న మేష్టరుగారు రథాంగపాణి. రథాంగపాణిగారంటే పిల్లలందరికీ భయం, భక్తిన్నీ. అయన పాఠం బాగా చెప్పగలడు. మధ్య మధ్య తమాషాగా నవ్వించగలడు. అల్లరిచేస్తూన్న వాళ్ళనీ, పాఠం వినకుండా కునికిపాట్లు పడేవాళ్లనీ ఒక కంట కనిపెడుతూ, తమాషాగా ఏడిపించనూగలడు.

ఆయనంటే పిల్లలకే కాదు, మాష్టర్లందరికీ కూడా చాలా గౌరవం. వారంతా కూడా రథాంగపాణిగారికే హెడ్‌మేష్టరీ ఉద్యోగం ఔతుందనుకున్నారు. అవటంతోనే ఒక టీపార్టీ కూడా చేద్దామని ముందుగానే చందాలు వేసుకున్నారు.

ఐతే—రథాంగపాణిగారికి హెడ్‌మేష్టరీ కాలేదు! ఆయన తర్వాత మేష్టరుకీ లేదు, మొదటి పదిమందినీ తప్పించి పదకొండోవాడైన సన్యాసిరాజుని హెడ్‌మేష్టరుగా వేశారు. ఈ సంగతి తెలిసి మేష్టర్లందరూ "అన్యాయం! అన్యాయం!!" అన్నారు, లోలోపలనే.

పైన పదిమంది మేష్టర్లు వుండగా పదకొండోవాడైన సన్యాసిరాజుకి ఉద్యోగం రావటానికి కారణం: ఉద్యోగంయిచ్చే అధికారికి అతడు మేనకోడలి భర్తకు పినతండ్రి కొడుకు కావటమే. అధికారి ఈ కారణం చెప్పకుండా 'హెడ్‌మాష్టరుకి ఉండవలసిన విగ్రహపుష్టి వుంది, సన్యాసిరాజుకి. అతడు చురుకైనవాడు. మీరంతా ముసిలివాళ్ళు!' అన్నాడు.

పాలంకి వెంకట రామచంద్రమూర్తి - మదరాసు



'మేమంతా సర్వీసు ఉన్నవాళ్లం! అతని కంటే పెద్దవాళ్లమే కాని ముసిలివాళ్లం కామండీ!' అని ఆ మేష్టర్లు గోలపెట్టేరు. కాని వినేవాళ్ళెవరు? సూటు, బూటు వేసుకువచ్చి సన్యాసిరాజు హెడ్‌మేష్టరు కుర్చీలో కూర్చున్నాడు.

సన్యాసిరాజు అదృష్టవంతుడే కాని, బుద్ధిమంతుడు కాలేకపోయాడు. అంతవరకూ తనపైనవున్న ఆ పదిమంది మేష్టర్లనైనా అతగాడు కాస్త మర్యాదగా చూడవలసింది; కొన్నాళ్లపాటు కొంచెంతెలివిగా మసులుకో వలసింది. మసులుకున్నాడు కాడు. మేష్టర్లు రథాంగపాణికి ఇస్తామన్న టీపార్టీ, తనకి యిచ్చారు కాదన్న కోపంతో అతడు అధికారం చెలాయించసాగాడు.

"మీరు సరిగ్గా వేళకి రావటంలేదు. మీక్లాసులో గొడవ ఎక్కువగా వుంది. మీరు సరిగ్గా పాఠాలుచెప్పటంలేదు!" అంటూ ఒక్కొక్కర్నీ సతాయించటం మొదలెట్టేడు.

అంతటితో ఊరుకున్నా తీరిపోను. వాళ్ల క్లాసుల్లోకి వెళ్ళి అజమాయిషీ చేసేవాడు. వాళ్ళు చెబుతూన్నది రైటుగావున్నా తప్పు అనుకొని దిద్దబోయేవాడు. అదృష్టంపండి అధికారం వచ్చిందికాని, అంతమాత్రాన సన్యాసిరాజు తనకు సమస్తం తెలుసునను కోవడం పొరబాటుకదూ!

తక్కిన అందరు మేష్టర్లకంటె అతడు ముఖ్యంగా రథాంగపాణినే యెక్కువగా ఇబ్బందిపెట్టడం మొదలుపెట్టేడు. 'నేను వరాండాలోంచి వెడుతూంటే, నన్నుచూసీ కూడా మీరు కుర్చీలోంచి లేవలేదు' అన్నాడొకనాడు.

మరోమాటు, 'మీరు మొన్న నాకు బజార్లో యెదురైనప్పుడు నమస్కారంపెట్ట లేదే!' అన్నాడు. ఆమాటకు రథాంగపాణికి చాలా కోపంవచ్చింది. ఐనా దిగమింగేసుకుని తొణక్కుండా, 'అబ్బాయ్, నువ్వు

నాకంటే చిన్నవాడివి! చిన్నవాళ్లకు పెద్ద వాళ్లు నమస్కారం పెట్టకూడదంటారు మనవాళ్ళు. అలాచేస్తే కుర్రవాళ్ళకి అయుక్షీణంసుమా!' అన్నాడు.

'ఇవన్నీ ముసిలివాళ్ళ మూఢనమ్మకాలు! నాకు వాటిమీద గౌరవంలేదు. ఇంతకీ నన్ను మీరు ఒక కుర్రవాని కింద జమకట్టి మాట్లాడకూడదు! నేను హెడ్‌మాష్టర్ని! మీరంతా నాకింద పనిచేసే తాబేదార్లు. అధికారరీత్యా నేను మీకంటే పెద్దగనక మీరు నాకా అధిక్యత చూపవలసిందే!' అన్నాడు సన్యాసిరాజు. అందుకు రథాంగపాణి తమాయించి, 'చిత్తం! ఇక పైన ఈ తాబేదారు తమ సెలవుప్రకారమే నడుచుకుంటాడు!' అనేసి వెళ్ళిపోయాడు.

హెడ్‌మేష్టరీ ఐనప్పట్నుంచీ సన్యాసిరాజు పెద్ద ఉద్యోగులకు మల్లే తనుకూడా పొద్దున్నే షికారుకి బయల్దేరేవాడు. తను కూడా పెద్దవేషంవేసి, చేతికర్ర ఒకటి పుచ్చుకుని ఠీవిగా నడుస్తూ వెడుతూండేవాడు. ఒకనాటి ఉదయం అతడు మామూలుప్రకారం షికారువెళ్లి వస్తూంటే అతాత్తుగా మబ్బువేసి చినుకులు ప్రారంభించినై. క్రమంగా వాన యెక్కువైంది.



తలదాచుకోటానికని అతడు రోడ్డుపక్కనున్న ఒకచెట్టుమొదట నిలబడ్డాడు. క్రమంగా వాన జోరై, తనకు అడ్డుగావుంటా యనుకున్న చెట్టుఆకులమీదనుంచే నీరు ధారగట్టి అతనిమీదపడడం ప్రారంభించింది. తలా వళ్ళూ తడిసిపోయినా బాధలేదుగాని కొత్తగా కొనుక్కున్న బూటు నానిపోతున్నందుకు విచారించాడు. వెంటనే బూటువిప్పేసి ఎడంచేత్తో పట్టుకుని, రోడ్డు అవతల పొలంలో ఒక పందగజాల దూరాన్ని పాకవుంటే దానిలోకి చేరుకుందామని పరుగెత్త నారంభించాడు. దూరాన్నుంచి యెవరో, "ఏమండోయ్,

హెడ్‌మేష్టరుగారూ!" అని పిలిచినట్టయింది. అగేడు. ఎవరో గుబ్బగొడుగు వేసుకుని తనవైపే వస్తున్నారు.

అవచ్చేవాడెవడో యెరిగున్నవాడే ఐవుంటాడు. తాను జోళ్ళు చేతపుచ్చుకుని, వర్షంలో తడిసిపోతూ నడిరోడ్డుమీద ఇంకొకరి కంటపడడం సన్యాసిరాజుకి సుతరామూ యిష్టంలేదు. కాని ఆగక తప్పిందికాదు. అవతలాయన గొడుగులో తను వెడుతూ జోడు చేతపుచ్చుకోటం బాగుండదని తోచి, వెంటనే బూట్సు మళ్లీ కాళ్లకు తొడిగేసుకున్నాడు.

ఇంతలో గొడుగు వేసుకున్నాయన చేరువయినాడు. ఆయన మరెవరోకాదు, రథాంగపాణే! నిలువునా నీరైపోయాడు, సన్యాసిరాజు. 'గొడుగులోకి దయ చెయ్యండీ!' అని తనని ఆహ్వానిస్తే, వెళ్లటమా, వెళ్ళకపోవటమా? మీమాంసలో పడ్డాడు సన్యాసిరాజు. రథాంగపాణి సన్యాసిరాజుని ముఖాముఖీగా సమీపించి గొడుగు కామ బుజంమీద ఆనించి రెండు చేతులూ జోడించి, 'నమస్కారమండీ, హెడ్‌మేష్టరుగారూ!' అని అనేసి, క్షణమైనా ఆగకుండా తనదారిని తను వెళ్ళిపోయాడు.

సన్యాసిరాజుకి వచ్చిన కోపం అంతా ఇంతా కాదు. రథాంగపాణిని అమాంతంగా నమిలి మింగేదామా అనిపించింది. కోపంగా ఇంటికి చేరుకొని, తనకు ఉద్యోగమిచ్చిన ఆయనతో రథాంగపాణి మీద ఫిర్యాదు చేశాడు. ఐతే ఆయన సన్యాసిరాజును చివాట్లు పెట్టి, 'ఓయి వాజమ్మా! అధికారబలంతో ఎంతోకాలం నిగ్రహించలేవు. నలుగురనూ మంచిచేసుకు బ్రతుకు' అని బోధించాడు.

నాటినుండీ సన్యాసిరాజుకి అధికార గర్వం అణిగింది. బుద్ధితెచ్చుకున్నాడు. చిన్నా పెద్దా తారతమ్యంలేకుండా తనకు అందరూ నమస్కారం చేయాలనే జబ్బు కూడా కుదిరిపోయింది.






పూర్వకాలమందు ఒక పట్టణంలో నలుగురు స్నేహితులు ఉండేవారు. నలుగురూ కూడా దారిద్ర్యబాధవల్ల ఒక్కవిధంగా పీడింపబడుతూ ఉండేవాళ్లు.

అందులో ఒకడు తక్కినవారితో "అన్నలారా!—మానవుడికి అందచందాలున్నా, తెలివితేటలున్నా, ధైర్యసాహసాలున్నా, ఏమున్నప్పటికీ ధనమొక్కటి లోపమైతే ఎందుకూ కొరగాడు. డబ్బులేని వాడినిచూచి దగ్గిరచుట్టాలు ఏవగించుకుంటారు, ఎడమొగం పెడమొగంపెడతారు. ఇంతెందుకు?—కట్టుకొన్న భార్యా, కన్న బిడ్డలే వాడినుండి తొలగిపోతారు. పేదవాడికి సంఘంలో తావేలేదు. దూరం యోచిస్తే, పైసాలేని బ్రతుకుకంటె చావే మేలనిపిస్తుంది. కనుక ఏవిధంగానైనాసరే, మనం ధనం సంపాయించాలి" అంటూ మనసులోని ఆవేదన వెల్లడించాడు.

ఈమాటలు అందరకూ నచ్చినై.

ఆలోచించగా వారికి నిష్కంటకమైన మార్గం ఒక్కటే గోచరించింది. అదే దేశాటనం. దేశాటనంచేసి, తమ అదృష్టం యెలావుంటుందో చూచుకొందామని వారు నలుగురూ నిశ్చయించారు.

అనుకొన్నప్రకారం బయల్దేరి, వారు పోయిపోయి అవంతీపురం చేరుకొని, అలసటతీర్చుకుని, మళ్లీ కాలుసాగించారు. మరికొంచెందూరం వెళ్ళేసరికల్లా ఒక సిద్ధుడు కనిపించగా యాత్రికులు నలుగురూ భక్తివినయాలతో ఆ మహానుభావునికి నమస్కరించి, పూజించారు.

వారిభక్తికి సిద్ధుడు చాలా సంతోషించి, కుశలప్రశ్నలు వేసి, విశేషాలు ఏమిటని అడిగాడు. అందుకు వారు "మహాత్మా!—మేము యాత్రికులం. ఐశ్వర్యాకాంక్షతో బయల్దేరాము. కొల్లలుగా ధనరాసులు

ఎస్. సత్యకేశవరావు - బెజవాడ



సంపాదించటమో, మరణించటమో. అనే నిశ్చయంతో వున్నాము మేము. ఇప్పటి వరకూ జీవితంలో యాతనపడ్డాము. ఇక క్షణమైనా దారిద్ర్యబాధ భరించలేము" అని బదులుచెప్పారు.

సిద్ధుడు శ్రద్ధగా విన్నాడు. అప్పుడు మళ్లీ ఆ నలుగురలో పెద్దవాడు "మహాత్మా!- పురుషప్రయత్నంలేకుండా సిరిపట్టదుకదా, కష్టపడందీ సుఖంకలుగదుకదా! కాబట్టి, ఏ ఉపాయంచేతనైనాసరే మాకు లక్ష్మీ కటాక్షం కలిగేమార్గం చెప్పు. అదెంతటి కష్టమైనదైనాసరే చేసితీరుతాము, ఏపని చేయటానికైనా మేము ప్రాణాలకు తెగించి వున్నాము. నీశరణుజొచ్చాము. అనుగ్రహించు" అంటూ వేడుకొన్నాడు.

వారిమాటలకు సిద్ధుడు జాలిపడి, నాలుగు మంత్రదండాలు సృష్టించాడు. అవి చివర సూదిగా వున్నాయి. వాటినిచ్చి "అబ్బాయిలూ!—మిమ్మల్ని నా ప్రియ శిష్యులుగా ఎంచి, ప్రభావంగల ఈ మంత్ర దండాలను మీకు ప్రసాదిస్తున్నాను. వీటిని తీసుకుని వింధ్యపర్వతాలకు ఉత్తర దిశగా సాగిపొండి. మీరు పోయేలోపల ఒకొక్కరిచేతనున్న దండం ఒకొక్కచోట నేలపైనపడుతుంది. ఎవరిదండం ఎక్కడ పడుతుందో, అక్కడక్కడనే వారివారికి నిధి లభిస్తూవుంటుంది. మీకు శుభమవుతుంది, వెళ్ళిరండి!" అని దీవించిపంపాడు.

వారు నలుగురూ అపరిమితానంద భరితులయ్యారు. సిద్ధుడికి కృతజ్ఞత తెల్పటానికని సాష్టాంగ దండప్రణామాలు ఆచరించి, ఆయనవద్ద సెలవుతీసుకొన్నారు.

ఆయన చెప్పినట్టుగా వింధ్య ఉత్తర ప్రాంతానికి ప్రయాణంచేస్తూపోగా ఒకచోట ఒకని చేతిలోని మంత్రదండం జారి కింద పడింది. అక్కడ తవ్వి చూడగా రాగి మయంగావున్నది. ఆ దండధారి తక్కిన





వారితో "నేస్తులారా!—మనమీ తామ్రం పట్టుకుపోదాం. ఇది విక్రయిస్తే బోలెడంత ధనంవస్తుంది. మన దారిద్ర్యమంతా పటాపంచలవుతుంది" అన్నాడు. అందుకు వారు 'ఓరి మూర్ఖుడా!— ఈ పాడు తామ్రంతో పనిజరిగేదేమిటి, మనం బాగుపడేదేమిటి? ముందుముందు యింకా ఏం దొరుకుతుందో చూతాం రా" అన్నారు. అప్పుడు మొదటివాడు 'నేనురాను. ప్రాప్తించిన ఈ రాగితోనే నాకు తృప్తికలిగింది" అంటూ ఇంటిముఖం పట్టాడు. తక్కిన ముగ్గురూ వానినిపరిహసిస్తూ సాగిపోయారు.

మిగిలిన ముగ్గురూ మరికొంచెందూరం పోయేసరికి రెండవవాడి మంత్రదండం కిందపడింది. అక్కడ త్రవ్విచూస్తే అదంతా వెండిమయంగా వుంది. ఆ రెండవ దండధారి ఈ రజతం పట్టుకుపోదామన్నాడు. కాని తక్కినయిద్దరూ ఇష్టపడలేదు. 'ఓయి మూర్ఖుడా!— మొదట రాగి కనిపించింది. ఇప్పుడు వెండికనిపించింది. ముందు తప్పక బంగారుకనిపిస్తుంది. అది మానుకొని దీనితో తృప్తిపడటం వెర్రిగాక మరేమిటి?' అంటూ వానిని వేళాకోళంచేసి వారు సాగిపోయారు. ప్రాప్తమున్న సొమ్ములభించిందనే తృప్తితో రెండవవాడు రజతంపట్టుకొని ఇంటికి మరలిపోయాడు.

ఇప్పుడు మిగిలినయిద్దరూ పోతూవుండగా, ఇంకొంచెందూరంలో మూడవవానిదండం నేలబడింది. ఇక్కడ నిజంగానే స్వర్ణమయమైనస్థలం కనిపించింది. మూడవవాడు 'ఇదితీసుకపోదా'మన్నాడు పొంగిపోతూ. కాని, నాల్గవవాడికిమాత్రం ఆశ యింకా వదలలేదు. ఇప్పటికి వరసగా రాగి, వెండి, బంగారం లభించినైకద! ముందుముందు వజ్రాలు లభించక పోతాయా అనుకొంటూ, మూడవవాణ్ణి పంపివేసి తనొక్కడూ సాగిపోయాడు.

నాల్గవవాడు ఎంతనడిచినా దూరం తరగటంలేదు. ఆకలిదప్పు లెక్కువైనాయి. అలసట మిక్కుటమైంది. పోగాపోగా ఒక చోట అతని దండం పడింది. గప్పున ఒక వెలుగువచ్చి, ఆ వెలుగులో చిత్రమైన మనుష్యుడు తారసపడ్డాడు. వాడు నిలువ ఖడివున్నాడు. తలపైన ఒక చక్రం ఎడతెగక గిరగిరతిరుగుతున్నది. ఒంటినిండ నెత్తురు లోడుతున్నప్పటికీ, వాడు దేవుడా అంటూ బాధపడుతూ, అలానే నిలిచివున్నాడు.

ఆశ్చర్యంతో దండధారి 'ఏమిటయ్యా ఈ విడ్డూరమంతా?' అని వానిని ప్రశ్నించాడు, అలా ప్రశ్నించడమేతడవుగా ఆ చక్రం వానితలపైనుండివచ్చి నాల్గవవాని తలపైన పడి, యథాప్రకారం గిరగిర తిరుగ సాగింది. ఇప్పుడు నాల్గవవాని ఒళ్ళంతా నెత్తురుమయమై, యమబాధగావున్నది.

అప్పుడు దండధారి 'ఏమిస్వామీ!— ఈ తంటసం నాకుతగిలించావే! ప్రాణాలు పోతున్నవి. దయవుంచి దీనినితొలగించు. వజ్రాలూవద్దూ, పాడూవద్దూ. బ్రతికివుంటే బలుసాకు ఏరుకుతింటాను. నన్ను విముక్తునిచేసి పుణ్యంకట్టుకో' మంటూ ప్రాధేయపడ్డాడు.

అందుకు వాడు 'నాయనా! నేనూ నీవంటివాడినే. నాకేమీ మహిమలు తెలియవు. దురాశతో నీలాగానే నేనూ వచ్చి ఇప్పటివరకూ యమయాతనను అనుభవించాను, నేను రామావతారకాలమందు ఇక్కడ చేరుకున్నాను. అనగా ఇప్పటి కెన్ని శతాబ్దాలు గడచినవో! నువునన్ను విడిపించినట్టుగానే మళ్ళీ ఎవడైనావచ్చి నిన్ను విడిపించాలేగాని, అంతవరకూ నీకీ అవస్థతప్పదు. నన్ను యమబాధనుండి తప్పించావు. ఇదే నీకు నమస్కారం!' అంటూ సమాధానంచెప్పి, ఇంతకాలంనించీ చక్రంతిరిగిన బాధచేత బొప్పికట్టిన తల తడుముకొంటూ సాగిపోయాడు.





# బక్క గుఱ్ఱం

CHITRA

జంబూద్వీపంలో తాళధ్వజం అనే పట్టణాన్ని విక్రముడనే రాజు పరిపాలించేవాడు. ఆయనకు మాధవవర్మ అనే కొడుకు. మాధవవర్మ చాలా అందమైనవాడు. 'పెళ్ళిచేసుకో'మని ఎంతటి అందగత్తెనుతెచ్చినా, అతడికి నచ్చేదికాదు.

ఒకనాడు అతడు హిమాలయ పర్వతాల్లో గంధర్వలోయకు వేటకని వెళ్ళేడు. ఆ నిర్జనారణ్యంలో అతణ్ణెవరో 'రాకుమారా' అని పిలిచినట్టయింది. వెనక్కి తిరిగి చూసేసరికి ఒక సుందరి ప్రత్యక్షమై, 'అయ్యా, నేను చంద్రకళ అనే గంధర్వకాంతను. నీ అందానికితగ్గ చక్కనిచుక్క, సులోచన అనే మా స్నేహితురాలున్నది. ఆమె ప్లక్ష ద్వీపపు రాజుగారి కుమార్తె. మీ అశ్వశాలలోవుండే బక్కగుఱ్ఱంమీద ప్లక్షద్వీపపు ముఖ్యపట్టణమైన దీప్తిపురం చేరుకుని, ఆ పట్టణంలోవున్న పువ్వులమ్మే గంధిని కలుసుకో. దానికి నాపేరుచెబితే కార్యం చక్కబడుతుంది' అని చెప్పింది. మాధవవర్మ సంతోషించి, బయల్దేరబోయాడు. ఐతే, చంద్రకళ, 'ఉండు; పెళ్ళిచేసుకువచ్చాక ఆ గుఱ్ఱాన్నిమాత్రం నాకు ఇచ్చెయ్యాలి సుమా. దానితో నాకు పనివున్నది. శుభమస్తు. వెళ్ళిరా' అంటూ అదృశ్యమైంది.

మాధవవర్మ అశ్వశాలలో ప్రవేశించేసరికి ఆ బక్కగుఱ్ఱం సకిలించింది. అతడు ఆప్యాయంగా దానివళ్ళు నిమురగా దానికి అపూర్వమైన పుష్టి వచ్చింది. అంతేకాదు. రెక్కలుగూడా వచ్చాయి! అంతవరకూ దానివద్ద పనిచేస్తూన్న ప్రచేష్టుడు అనే నౌఖరు ఇదంతాచూసి ఆశ్చర్యపోయాడు. యువరాజు సంగతంతా చెప్పాడు. అప్పుడు ప్రచేష్టుడు 'ప్రభూ, నన్నుకూడా తీసుకు వెళ్ళరా?' అని కోరగా యువరాజు 'సరే' రమ్మని, తాను గుఱ్ఱంఎక్కేడు.

యస్. సంగమేశ్వరం - జంషెడ్పూర్



ప్రవేష్టుడు తోకపట్టుకుని వ్రేలాడగా, గుఱ్ఱం ఆకాశమార్గాన జివ్వుమంటూ పోయి, ప్లక్ష ద్వీపంలోని దీప్తిపురం చేరుకుంది.

మాధవవర్మ అక్కడ చేరుకొని, గంధిని అనే ఆ పూలదాన్ని కలుసుకొని, సంగతి సందర్భాలు చెప్పాడు. గంధిని పెదవివిరచి, 'అరరె, నిన్ను నేవస్తే ఎంతబాగుండిపోయేది! సులోచనకి సంబంధం నిశ్చయమైంది. రేపే పెళ్ళి. కుశద్వీపపు చక్రవర్తి కుమారుడు, విద్యాధరుడు పెళ్ళికొడుకు. అతడు నీ అంత అందగాడు కాకనుకో. తీరా సంబంధం నిశ్చయం ఐపోయాక సులోచనమాత్రం వొద్దని అనగలదా' అంది.

ప్రచేష్టుడు ఇంతదూరమూ వచ్చి పెళ్ళికూతుర్ని చూడకుండా పోకూడదనుకున్నాడు. అప్పుడు గంధిని ఒక పళ్లగంప తెచ్చి, అందులో మాధవవర్మని కూచోమని పైన పూలుపరిచి, ప్రచేష్టుడిచేత ఆ బుట్టను మోయించుకుని సులోచన మేడకు తీసుకుపోయింది.

సులోచన మాధవవర్మను చూట్టంతోనే, ఆమె కంతకుపూర్వం నిశ్చయమైన పెళ్ళికొడుకు సూర్యుడిముందు దివిటీలా తోచాడు. మాధవవర్మ వినేటట్లు ఆమె 'గంధినీ, నేను విధ్యాధరుణ్ణి పెళ్ళి చేసుకోనే. రేపు పుస్తెకట్టేవేళకి నేనులేచి నిలబడి చేతులు పైకియెత్తుతాను. అప్పుడు నన్ను తన గుఱ్ఱంమీద యెక్కించుకుని ఈయనను యెగిరిపొమ్మనవే!' అంది. మాధవవర్మ తన అదృష్టానికి మెచ్చుకుంటూ మళ్ళీ ఆ గంపలో కూర్చుని బయటకు వచ్చేశాడు.

మాధవవర్మతోబాటు ప్రచేష్టుడుకూడా సులోచనను చూశాడుకదా! ఆ అమ్మాయిని తనే పెళ్ళిచేసుకోవా లనిపించింది వాడికి. మర్నాడు మాధవవర్మ తాగేపాలలో వాడు మత్తుమందు కలిపి ఇచ్చాడు. అవి




త్రాగి మాధవవర్మ మైకంలో పడిపోయాడు. పెళ్ళివేళ పుస్తెకట్టే సమయంవచ్చింది. సులోచన నిలబడి చేతులెత్తింది. పైనుంచి గుఱ్ఱందిగడం, దానిమీదికి ఆమెను యెగ రేసుకుని యెవరో ఆకాశమార్గాన మాయం కావటం క్షణంలో జరిగింది.

ఆ గుఱ్ఱంమీదవచ్చి తనను తీసుకుపోతున్నది మాధవవర్మే అనుకుంది సులోచన. ప్రచేష్టుడు సముద్రం దాటివచ్చి కాంచననగరానికి బయటవున్న ఒక అడవిలో దిగి, సులోచనతో "సమయానికి మాధవవర్మ నిద్రపోయాడు. ఆ నిర్భాగ్యుడికి నువ్వు తగవు అని ఆలోచించి నేనే నిన్ను తీసుకువచ్చాను. నాకేమి లోపమున్నది గనక? నన్ను పెళ్ళిచేసుకో!" అన్నాడు.

సులోచన తన దిగులు పైకి తెలియనియ్యకుండా, చిరునవ్వుతో, 'ఎవరికెవరు ప్రాప్తమోగదా! సరే, కానీ. ఈ రత్నకంకణం పట్టుకుపోయి ఆ కనపడే నగరంలోకి వెళ్ళి పుస్తెలుచేయించి పట్టుకురా. పురోహితుణ్ణికూడా వెంటబెట్టుకురా' అంది. పుట్టెడు సంబరంతో వాడు పట్టణం ప్రవేశించి ఆ రత్నకంకణం అమ్మజూపేసరికి అక్కడి రక్షకభటులు 'వీడెవడో దొంగ!' అని అనుమానించి, వాణ్ణి ఖైదులోవేశారు.

ప్రచేష్టుడు పోవటంతోనే యిక్కడ సులోచన, గుఱ్ఱాన్నెక్కి జంబూద్వీపంలోని భరతఖండం ప్రవేశించి కాశీపట్టణం చేరుకుంది. ఆ పట్టణం పట్టపగలే జనసంచారం లేక మాటుమణిగివుంది. ఆమె ఒక అవ్వ ఇల్లు చేరి, విశేషాలు అడిగేసరికి ఆ అవ్వ, 'అయ్యో! నీకుతెలీదా? రోజూ మధ్యాహ్నం పన్నెండు గంటలవేళప్పుడు గంగలోంచి ఖడ్గమృగం ఒకటి ఊళ్ళోకివచ్చి కనపడ్డ మనిషినల్లా చంపితినేస్తోంది! ఈ మృగాన్ని చంపినవాడికి అర్థరాజ్యం యిచ్చి తన




కుమార్తెను పెళ్ళిచేస్తానని రాజుగారు వాగ్దానంచేశారుకూడాను' అంది. సులోచన వెంటనే ఒక రాజపుత్రుని దుస్తులుధరించి, ఒక ఖడ్గంకూడా సిద్ధంగా వుంచుకుని ఖడ్గమృగంకోసం ఎదురుచూస్తున్నది.

సరిగ్గా పన్నెండు కొట్టేసరికి, భూమి అదిరేటట్లు అరుస్తూ ఖడ్గమృగం వచ్చి, చిందులు తొక్కసాగింది. సులోచన చటుక్కున గుర్రంమీదినించి దిగివచ్చి, కసుక్కున దానికంఠం నరికేసింది!

ఆ కళేబరంలోంచి దివ్యతేజస్సుతో మునీశ్వరుడొకడు ప్రత్యక్షమై, 'సులోచనా, నాకు శాపవిముక్తి కలుగజేశావు. నీకేం వరంకావాలో కోరుకో' అన్నాడు. ఆమె ఆశ్చర్యంతో వచ్చి, ఆయనకు నమస్కరించి, 'స్వామీ, నాకు కావలిసిన వరం ఒక్కటే. కుశద్వీపపు రాజకుమారుణ్ణి కాదని మాధవవర్మని పరిణయమాడబోతే, 'ఉభయభ్రష్టుత్వం, ఉపరిసన్యాసం' అన్నట్లయింది నాపని! నిశ్చయమైన వరుణ్ణి మోసంచేసినందుకు నాకీశాస్తి అయివుంటుంది. నాకు మాధవవర్మే భర్త అయేటట్లు అనుగ్రహించండి' అంది.

ఆ మాట విని ముని, 'సులోచనా, మాధవవర్మా విద్యాధరుడూకూడా కొద్ది రోజుల్లో ఒక రత్నాల వర్తకుని ఓడమీద ఈదారినే వస్తారు. అప్పుడు నీకోరిక సిద్ధిస్తుంది. విద్యాధరునికి మోసం జరిగిందని మాత్రం నువ్వు పశ్చాత్తాపపడనక్కర్లేదు. అతడు మొదట ఈ కాశీరాజు కూతురైన జయంతిని పెండ్లిచేసుకోటానికి నిశ్చయించుకుని, నువ్వు యెక్కువ ఐశ్వర్యవంతురాలవని విని, నీకోసం తయారయాడు. నువ్వు మాయమయాక పశ్చాత్తాపపడ్డాడు. అతడూ మాధవవర్మా ఒకరి సంగతి ఒకరు తెలుసుకుని మంచి స్నేహితులయారిప్పుడు. ఆ ఓడ రాగానే మాధవ

వర్మను అనవాలుగట్టి వివాహంచేసుకో' అన్నాడు. అంతావిని సులోచన 'స్వామీ, మీరెవరు? మీకీ ఘోరరూపం యెలా వచ్చింది?' అని అడిగింది. 'ఆ కథంతా ముందు తెలుస్తుందిలే' అంటూ ఆయన, అదృశ్యుడయాడు.

ఆయన అదృశ్యుడు కావటంతోనే సులోచన తన గుఱ్ఱంకోసం వెనక్కి తిరిగి చూసింది. గుఱ్ఱం కనపడలేదు. దానికోసం నలుదిక్కులా వెతుకుతూంటే, అంతలో, ఖడ్గమృగాన్ని ఎవరో రాజకుమారుడు చంపేశాడన్నవార్త కాశీరాజుకి తెలిసి ఆయన సంతోషంతో వచ్చి, పురుషవేషంలో వున్న సులోచనను ఏనుగమీద ఎక్కించుకువెళ్ళి సింహాసనంమీద కూర్చోపెట్టేడు.

జయంతిని ఈ రాజకుమారునికిచ్చి పెళ్లిచేద్దామని రాజు తొందరపడ్డాడు. అందుకు సులోచన, రాజుకు నచ్చజెప్పి తను నిరీక్షిస్తున్న ఓడ వచ్చేవరకు పెళ్ళి నిలుపు చేయించింది.

రాజుగారు ఆ ఓడకోసం గంగాతీరాన్న భటుల్ని కాపలావేయించారు. కొంతకాలమయేసరికి ఆ ఓడ హంసలాగ చక్కా వచ్చింది. పురుషవేషంలోవున్న సులోచనకు




కబురువెళ్ళింది. "రత్నాలవర్తకుడితో ఆభరణాలపెట్టెలు పట్టించుకుని రమ్మని చెప్పండి" అంది ఆమె. ఆ వర్తకుడు సంతోషంతో, మంచి మంచి నగలన్నీ పట్టించుకుని అంతఃపురంలోకి వచ్చాడు. సులోచన ఆ ఇద్దరు నౌఖర్లలో ఒకడు మాధవవర్మ అనీ, రెండోవాడు విద్యాధరుడనీ ఆనవాలు కట్టేసింది.

వెంటనే ఆమె కాశీరాజువద్దకు వెళ్లి, "ఈరాత్రే పెళ్ళిముహూర్తం పెట్టించండి. రెండుజతల పుస్తెలు చేయించండి" అంది. "రెండుజతలు యెందుకుచెప్మా?" అనుకుంటూనే రాజు పెళ్ళిప్రయత్నం చేశాడు.

సులోచన రహస్యంగా వర్తకుడితో, 'అయ్యా, నీక్రింద నౌఖరీకి కుదిరిన వీళ్ళిద్దరూ చక్రవర్తుల కొమాళ్ళు. వీళ్ళకి ఈ రాత్రే పెళ్ళి. ఇద్దర్నీ అలంకరించి, మగ పెళ్లివారికిమల్లే మీరు తరలిరండి!' అని సంగతంతా విశదపరిచి పంపింది.

పెళ్లిపీటలు రెండువేశారు. జయంతిని పెళ్ళికూతుర్ని చేశారు. 'రెండో పెళ్ళికూతురు ఎవరు?' అనేప్రశ్న వచ్చేసరికి, సులోచన తన తలపాగా తీసేసి, 'నేనే!' అంది. అంతా ఆశ్చర్యపోయారు. ముహూర్తంవేళకి విద్యాధరుడూ, మాధవవర్మా పెళ్ళికొడుకులై వచ్చారు. సులోచన విద్యాధరుణ్ణి జయంతి వద్దకు తీసుకుపోయి, 'ఇదిగోనో, నీపెళ్లికొడుకు!' అంది. అందరూ అతణ్ణి ఆనమాలుగట్టి, మొదట నిశ్చయమైన పెళికొడుకేఅని సంతోషించారు.

ఇంతలో ఎక్కణ్ణుంచో చంద్రకళ వచ్చింది. చంద్రకళ హిమాలయ పర్వతాలో, మాధవవర్మకు సులోచనసంగతి చెప్పిన గంధర్వకాంత. ఆమెవెంట ఒక సుందరాంగుడు కూడా వచ్చాడు. చంద్రకళ నవ్వుతూ, "మా ఆయనే ఈయన, చిత్రాంగుడు! మిమ్మల్ని మోసిన ఆ రెక్కలగుఱ్ఱం ఈయనే!" అంది. వాళ్ళిద్దరూ నివ్వెరపోయి, మీరు గుఱ్ఱంగా ఎందుకువున్నారు?" అని అడిగేసరికి, చిత్రాంగుడు "ఎందుకేమిటి? శాపం! నేనూ చంద్రకళ షికారు వెళుతూండగా గట్టిగా నవ్వాను. అక్కడ తపస్సు చేసుకుంటూన్న ఒకఋషి చిరాకుపడి "గుఱ్ఱానికిమల్లే సకిలించి నా తపస్సుకు భంగం కలుగచేశావు గనక గుఱ్ఱానివైపో!" అన్నాడు. నాకు వొళ్లుమండి "ఈమాత్రందానికే ఇంత ఘోరశాపం ఇస్తావా? నీవు ఖడ్గమృగానివై పుట్టు!" అని మారుశాపం యిచ్చాను. ఆ ఖడ్గమృగాన్నే సులోచన చంపింది. అది పోగానే నాకు మామూలురూపం వచ్చింది' అనిచెప్పాడు.



# తీరని వరాలు

పూర్వం ద్వీదర్భ అనే దేశాన్ని భగ్నకర్ణుడనే రాజు పాలిస్తూ ఉండేవాడు. పాపం ఆరాజుకు యెంత కాలానికీ పిల్లలు కలగలేదు. భగ్నకర్ణుడికి నడివయసు దాటి వృద్ధాప్యం సమీపిస్తున్న కాలంలో హిమాలయవాసి అయిన ఒక మునిపుంగవుడు, గజశృంగి అనే ఆయన, ద్వీదర్భకు వేంచేశాడు. ఆయన రాక విని భగ్నకర్ణుడు సపరివారుడై ఆయనకు ఎదురువెళ్ళి, పాదపూజచేసి, తన అతిథ్యం స్వీకరించమని వేడుకున్నాడు.

రాజుగారి పరిచర్యలకూ, భక్తికీ మెచ్చినవాడై గజశృంగి, "రాజా, నీభక్తికి సంతోషించాము. ఏదైనా వరం కోరుకో, యిస్తాము," అన్నాడు.

"మునిపుంగవా, తమ దయవల్ల నాకే లోటూలేదు. కాని సంతానం లేనికొరత మాత్రం నన్ను బాధిస్తోంది. ఇహంలో పితృత్వసౌఖ్యం కలిగేలాగున్నూ, పరంలో పుంనరకబాధ తొలగేలాగున్నూ ఒక్క కుమారుణ్ణి ప్రసాదించండి!" అన్నాడు భగ్నకర్ణుడు.

రాజుకు పిల్లవాడు కలిగేటట్టు అనుగ్రహించి గజశృంగి, తన అంగవస్త్రంలో నుంచి సీసా ఒకటితీసి, అందులోని పసరు రెండు పాదాలకూ పూసుకుని, కళ్ళు మూసుకుని యేవో మంత్రాలు చదివి ఒక్క తృటిలో హిమాలయాలకు తిరిగి వెళ్ళాడు. పోతూ పోతూ, "రాజా, నీకుమారుడి ఇరవై ఒకటవ జన్మదినంనాడు మళ్ళీ దర్శనమిస్తాము," అన్నాడు మునిపుంగవుడు. అయితే ఈ మాటలు రాజుకు సరిగా వినిపించలేదు. ఆయనకు కొద్దిగా చెవుడు.

సంవత్సరం తిరిగివచ్చేలోపునే భగ్నకర్ణుడికి కుమారుడు కలిగాడు. రాజ్యమంతటా మహావైభవంగా ఉత్సవాలూ,

కొడవటిగంటి కుటుంబరావు - మదరాసు



విందులూ, అన్నదానాలూ జరిగాయి. రాజుగారు కుమారుడికి యథోక్తంగా బారసాల జరిపి, శరగామి అని నామకరణంచేశారు.

శరగామి ఎవరి అదుపాజ్ఞలూ లేకుండా, యెవరిపట్లా భయభక్తులు లేకుండా, విచ్చలవిడిగా పెరిగి రాసాగాడు. లేక లేక పుట్టిన కొడుకు కావడంచేత రాజుగారి గారాబం వాడికి జాస్తి అయింది. వాడిమీద యెవరేమి చాడీలుచెప్పినా రాజు వినిపించు కునేవాడు కాడు. శరగామి ఏ అవాచ్యాలు మాట్లాడినా రాజుకు వినిపించేవికావు.

ఇతర విషయాలలో శరగామి అంత దుష్టుడు కాడు గాని వాడి నోరు బొత్తిగా చెడ్డది. వాడి చేతికి వెరవనివారు కూడా వాడి నాలుకకు మహా వెరిచేవారు.

చూస్తుండగానే శరగామి పెద్దవాడైనాడు. వాడి ఇరవై ఒకటవ జన్మదినం వచ్చింది. ఆరోజు వృద్ధరాజు కొలువుతీర్చి మంత్రోక్తంగా శరగామిని తన అర్ధసింహాసనం మీద కూర్చోబెట్టాడు. అత్యంత వైభవంగా వున్న ఈ కొలువులోకి గజశృంగి ఆకస్మికంగా చక్కావచ్చాడు. భగ్నకర్ణుడు ఆయనను గుర్తించలేదు. శరగామి మటుకు గజశృంగిని చూసి "ఎవరీ గోసాయి?" అని మాత్రం అడిగాడు.

మునిపుంగవుడికి కోపంవచ్చింది. తనను మరచిపోయిన వృద్ధరాజునూ, అవమానించిన యువరాజునూ శపించడానికని కమండలం యెత్తాడు. అది చూడగానే భగ్నకర్ణుడికి భయంవేసింది. సింహాసనం దిగివచ్చి మునిపుంగవుడి కాళ్ళు రెండూ పట్టుకుని రక్షించమని వేడుకున్నాడు. గజశృంగి శాంతించాడు. ఆయనను వృద్ధరాజు తీసుకువచ్చి తన సమీపంలోనే ఆసనంమీద కూర్చోబెట్టాడు. మునిపుంగవులు భోగులలాగా కూర్చోరాదు గనక, ఆసనంమీది మెత్తపై తన కృష్ణాజినం పరిచి

గజశృంగి కూర్చుని, శరగామికేసి అసహ్యంగా చూశాడు. కారణం యేమంటే శరగామి అన్నమాట మునిపుంగవుడికి వినిపించింది. వాడు తనను క్షమాపణ వేడలేదు. రాజైనా కొడుకుచేత క్షమాపణ చెప్పించాడు కాడు. కొడుకు అన్నముక్క, పాపం, రాజుకు వినిపించలేదు మరి. తాను వేరే పనిమీద వచ్చినవాడై ఉండడంచేత గజశృంగి శరగామిని క్షమించడానికే నిశ్చయించాడు.



"రాజా, మేము నీకుమారుణ్ణి ఆశీర్వదించి పోవడానికి వచ్చాము," అన్నాడు గజశృంగి, రాజుకు వినపడేలాగ గట్టిగా.

"చిత్తం! తమ దయ!" అన్నాడు రాజు.

"వీడికి మూడు వరాలు ఇద్దామనుకున్నాము. ఒక్కటి మించి యివ్వడానికి మాకు మనస్కరించడంలేదు. వాడి ప్రారబ్ధం!" అన్నాడు ముని.

భగ్నకర్ణుడు పరవశుడై, "నాయనా, మునిపుంగవులను ఏదైనా ఒక వరం కోరు. వారు కటాక్షిస్తారు," అన్నాడు. అని గజశృంగికేసి తిరిగి, "స్వామీ, వాడితరఫున నేను కోరవచ్చునా?" అని అడిగాడు.

ముని కోపంగా ముఖం చిట్లించి, "వాడికి ప్రాజ్ఞత వచ్చింది. కాబట్టి వాడే వరం కోరుకోవాలి. నువు సంజ్ఞలు చేయడంగాని, మాటలు అందించడంగాని మేము సహించము," అన్నాడు.

ఇంతసేపూ ఆలోచిస్తున్న శరగామి, "నాకు మూడు వరాలుకావాలి!" అన్నాడు.

"వల్లకాదు. ఒకే వరం కోరుకో. తప్పు కోరుకున్నావా, అనుభవిస్తావు, జాగ్రత్త!" అన్నాడు ముని. శరగామిని చూస్తున్నకొద్దీ ఆయనకు ఏవగింపు హెచ్చుతున్నది.

"నాకు మూడు వరాలు కావాలి!" అన్నాడు శరగామి మొండిగా.




తాను ఇచ్చిన ఒక వరంకింద వాడు మూడు వరాలు అడుగుతున్నాడని మునికి అర్ధమయింది. మునికి కోపం రెచ్చి పోయింది. "ఇది చాలా అక్రమం," అన్నాడాయన.

"నాకు మూడువరాలు కావాలి. అదే నేనుకోరే ఒక్కవరమూనూ! ఇందులో అన్యాయం ఏమీలేదు. కావలిస్తే తార్కికు లను విచారించండి," అన్నాడు శరగామి.

తార్కికులు వచ్చారు. చర్చించారు. ఒక్కవరం అన్నది నిర్వచించడం సాధ్యం కాదన్నారు. "ఎంత చిన్న వరంలోకూడా అనేక వరాలు ఇమిడి వుండితీరుతా యన్నారు. పూర్వం సావిత్రికి యమధర్మ రాజు నూరుగురుపిల్లలు కలిగేటట్టు వర మిచ్చాడు. అవి నూరువరాలు కావడం మాట అటుంచి, సత్యవంతుడి ప్రాణ దానంతోసహా నూటఒక్కవరం కాలేదా? యమధర్మరాజుకు లేని ధర్మసందేహం గజశృంగి మహామునులంగారికి దేనికి?" అన్నారు తార్కికులు.

శాస్త్రానికి తల ఒగ్గవలిసి వచ్చింది. మహా ముని. "సరే నీ మూడువరాలూ అడుగు" అన్నాడాయన.

"తమను కేశరహితంగా చూడాలని వున్నది" అన్నాడు శరగామి చిరునవ్వుతో.

మరుక్షణమే ఆ నిండుకొలువులో గజ శృంగి మహాముని కేశరహితంగానేగాక, కేశవసనరహితంగా కూడా కనబడ్డాడు. హాహాకారాలు మిన్నుముట్టాయి. తపస్వి శాపోదకం చేతబట్టాడు.

శరగామికే భయంవేసింది, "స్వామీ తిరిగి యధాప్రకారం అవండీ" అన్నాడు.

తిరిగి కొలువులో శాంతి నెలకొన్నది.

"నీ వరాలు రెండు అయిపోయాయి. ఇంక ఒక్కటే మిగిలివుంది. కోరుకో!" అన్నాడు ముని.

"మళ్ళీ మూడువరాలు కావాలి!" అన్నాడు శరగామి, మునికేసి క్రీగంట చూస్తూ.

గజశృంగికి ముచ్చెమటలు పోశాయి.

"ఇంత కృతఘ్నత నేనెక్కడా చూడ లేదు. నువ్వీవిధంగా వరాలు పెంచుకుంటూ పోతూంటే మేమిక్కడ ఎంతకాలం నిల బడేది. మా తపశ్చర్య భగ్నంచేసుకోమా?" అన్నాడాయన ఎండి పిడచగట్టుకుపోతున్న గొంతుతో.

చివరకు ఒక ఏర్పాటుజరిగింది. ఈ ఏర్పాటుప్రకారం శరగామి కోరే వరాల తాలూకు జమాఖర్చులువేయడాని కొక గణిత శాస్త్రజ్ఞుణ్ణి నియమించారు. శరగామి నోటవచ్చే ప్రతికోరికనూ యథాతథంగా రచించడానికొక లేఖకుణ్ణికూడా నియమిం చారు. తాను పరోక్షంగావుండే, శరగామి వరాలు తీరేలాగు చూస్తానని మునిపుంగ వుడు వాగ్దానంచేసి అంతర్ధానమైనాడు. నిజానికి మహామునికి శరగామిని చూస్తున్న కొద్దీ ఏదో చెప్పరాని భయం పుట్టుకు రాసాగింది. ఈ కొలువులోనుంచి ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా బయట పడా లనిపించింది.




రోజులు గడిచాయి. శరగామి ముందు గానే జాగ్రత్తపడి కొన్నిలక్షల వరాలు జమ వేసుకున్నాడు. ఎందుకంటే మునిపుంగ వుడు అతనిమీద కక్షపట్టి అతని నోటివెంట వెలువడే ప్రతికోరికనూ ఒకవరంకింద పరి గణించి తీర్చేస్తున్నాడు. కొంచెం ఉక్కగా వున్నట్టుతోచి శరగామి, "కాస్త చల్లగాలి తిరిగితే బాగుండునే!" అనుకున్నాడు. వెంటనే ఒళ్లుబిగిసి రక్తం కరడుగట్టే చలి గాలి వీచేది. దాన్ని ఉపసంహరించడానికి "అబ్బబ్బా, ఈగాలి నాకువద్దు" అనేసరి కల్లా అసలు గాలే లేకుండాపోయి శరగామి ఉక్కిరిబిక్కిరి అయి మళ్లీ ఇంకో వరం





కోరుకోవలసి వచ్చేది. అరవిఘడియ కాలంలో శరగామి అయిదువరాలు వ్యర్థం చేసుకున్న సమయాలుకూడా వుండేవి. తన వరాలను పెంచుకోవాలని శరగామి ఎంత పట్టుదలగా వున్నాడో, వాటిని వ్యర్థంచెయ్యాలని మునిపుంగవుడుకూడా అంత పట్టుదలగానే వున్నాడు.

ఇంతేకాదు. శరగామికి ఈ వరాలవల్ల కించిత్తయినా సుఖంగాని, లాభంగాని లేకుండాచెయ్యడానికి యెన్ని అవకాశాలున్నాయో అన్నిటినీ మునిపుంగవుడు అన్వేషిస్తున్నట్టు కనబడ్డాడు. "ఈసమయంలో ఒక అడవిలో సెలయేరుపక్కన కూర్చునివుంటే బాగుండును" అని శరగామి అనుకున్నదేతడవుగా అతను అడవిలో సెలయేరుపక్కన వుండడమేకాక అతనిచుట్టూ సింహాలూ, పులులూ, మొసళ్లూ మొదలైన భయంకర జంతువులు తయారయేవి. అందమైన స్త్రీ కావాలనుకుంటే అందమైన స్త్రీ తయారయేది కాని ఆమె శరీరమంతా కురూపంగా వుండేది.

ఇంత ఎందుకూ? శరగామి తన మనస్సులో అనుకునే మాటలుకూడా అతి జాగ్రత్తగా ఏరుకుని వాడుకోకపోతే ఏదో ఒక భయంకరమైన పరిణామం జరుగుతూండేది. ఇతరులతో మాట్లాడేటప్పుడు కూడా శరగామి తన పాత అలవాట్లు మానేయవలసి వచ్చింది. ఉదాహరణకు ఒక సందర్భంలో శరగామి, తనతోకూడా వ్యవహారాలు మాట్లాడవచ్చిన ఒక వర్తకుడితో, "మనం తిరిగి కలుసుకుందాం" అన్నకారణంగా ఇద్దరూ అంటుకుపోయారు. మూడు వరాలు వ్యయంచేస్తేగాని తిరిగి యథాస్థితి ఏర్పడలేదు. అదేవిధంగా శరగామి భోజనందగ్గిర "అది కావాలి, ఇది కావాలి" అని అడిగే అలవాటు మానాడు. తన నౌకర్లుతీర్చగల కోరికలకుకూడా మునీ



శ్వరుడు వరాలను వ్యర్థంచేస్తూ వచ్చే వాడు.

ఈవిధంగా గజశృంగిమహాముని తో ఘర్షణపడడం శరగామికి సరదాగా ఉండే మోగాని ఇతరులకు ఏమాత్రమూ రుచించ లేదు. అతనికి స్నేహితులు దూరమైనారు. అతని సమీపంలో ఉండడం వారికి చాలా ప్రమాదకరంగా తోచింది. అతని పరిచార కులు అతని మూలంగా నానా అగచాట్లూ పడుతూ వుండేవారు.

ఎప్పుడైనా చీకాకుకలిగి శరగామి తన నౌకర్లను "నీదుంపతెగా! నిన్ను పాతెయ్యా! నీకు పుండుపుట్టా! నిన్ను తగలెయ్యా!" అని మాటవరసకు తిట్టినప్పుడల్లా నౌకర్లు ఒక్కొక్క భయంకరమైన చావుచచ్చి, తిరిగి శరగామి వరాల సహాయంతో మళ్ళీ బతుకుతూ వుండేవాడు.

శరగామిని గురించి వింతవార్తలు దేశ దేశాలా వ్యాపించాయి. అతన్ని పెళ్లాడ డానికి ఏ దేశపు రాజకుమార్తెకూడా ఒప్ప లేదు, అతన్ని అల్లుడుగా చేసుకునేటం దుకు ఏదేశపురాజూ సాహసించలేదు. రాజ కుటుంబాలకు చెందిన స్త్రీలే శరగామిగాలి తమకు సోకనిచ్చేవారు కారు.




కడకు శరగామి కాలక్షేపానికి రకరకాల ఆటలు కనిపెట్టాడు. అవి ఆడడానికి రెండో మనిషి అవసరంలేదు. క్రమేణా ఈ ఆటలే అతనికి శరణ్యమయాయి. శరగామి పేర ఎన్నో లక్షలవరాలు జమ అయివున్నాయి. కాని ఏంలాభం? వాటిద్వారా కించిత్తయినా ఆనందంపొందే ఆశ అతనికి లేదు. మహా ముని అతనిమీద గట్టి పగపట్టాడు.

ఒకరోజు సాయంకాలం అలవాటు చొప్పున శరగామి తాను సృష్టించిన ఒక కొత్త ఆట యేకాంతంగా ఆడుకోసాగాడు.

ఈ ఆటకు ఒక పటం వుంటుంది. అందులో గళ్లుంటాయి, గవ్వలు పందెంవేసి

పావును నడుపుకొంటూ పోవాలి. పటంలో కొన్ని పాములూ, కొన్ని నిచ్చెనలూ వుంటాయి. పంవెం పావు సరిగా నిచ్చెన అడుగుకు వచ్చిందో పైకి యెక్కేస్తుంది; పాము తల దగ్గరికి వచ్చిందో తోకదగ్గిరికి దిగిపోతుంది.

ఇవాళ, అదేంచిత్రమో, శరగామి పావు శరవేగంతో వైకుంఠానికి యెక్కిపోయింది. అది ప్రతినిచ్చెనా యెక్కింది, కాని దాన్ని ఒక్క పామూ కరవలేదు. శరగామి పరమానందభరితుడైనాడు. "అహా! ఈ ఘడియ మళ్ళీ రాకూడదూ?" అనుకున్నాడు. అనుకున్నదే తడవుగా రెండో ఆటకూడా అట్లాగే వచ్చింది. మళ్ళీ ఆడి చివరను శరగామి, మొదటిమారులాగే, "అహా! ఈ ఘడియ మళ్ళీ రాకూడదూ?" అనుకున్నాడు. ఇంతకాలానికి శరగామి మహాముని చేతికి చిక్కాడు. అతని వరాలు ఒక్కొక్కటే, ఘడియ కొకటి చొప్పున, ఖర్చవుతున్నాయి. ఆట ఆడటమూ, ఆఖరున ఆఘడియ తిరిగి రావాలని కోరడమూ—ఈ విధంగా అదే ఘడియను మళ్ళీ మళ్ళీ తెప్పించుకుంటున్నాడు శరగామి.

ముసలిరాజు చచ్చిపోయినాడు. ఆ వంశం అంతరించింది. కొత్త యుగాలు వచ్చాయి. తుఫానులు వచ్చాయి. భూకంపాలువచ్చాయి. ద్వీదర్భ యెన్నోసార్లు శిథిలమయింది. భూగర్భంలోకి దిగిపాయింది. దానిమీద దిబ్బవేసింది.తన అభ్యంతర గృహంలో కూచుని యింకా ఆ ఆటే ఆడుతున్నాడు శరగామి. అతని వరాలు ఎప్పటికి తీరిపోతాయో యెవరికీ తెలీదు. అది హిమాలయాలమీది మునిపుంగవుడికి ఒక్కడికే తెలుసు.

ఇంతకూ ఆ శరగామి ఆడే ఆటను 'వైకుంఠపాళీ' అంటారు. ఈ ఆటకు ఉపయోగించే పటాన్ని 'పరమపద సోపాన పటం' అంటారు.






పూర్వకాలమందు ఒకప్పుడు, ఆదిశేషువు పైన పడుకొని లక్ష్మీదేవి పరిచర్యలను పొందుతూవున్న శ్రీమహావిష్ణువు ఎందుకో గాని హఠాత్తుగా లేచాడు. లేచి, ఒక్క తృటిలో అదృశ్యమయ్యాడు! ఇదిచూచి లక్ష్మి కంగారుపడింది. లక్ష్మి కంగారు పడటంతో స్వర్గలోకమంతా అల్లకల్లోల మైంది. యేమీ పాలుపోక లక్ష్మి బ్రహ్మకూ మహేశ్వరునికీ కబురుపంపి రప్పించింది.

వీళ్లందరూ ఈ విధంగా గుంజాటన పడుతూవుండగానే శ్రీమహావిష్ణువు మళ్ళీ వచ్చేసి, యథాప్రకారం పడుకొన్నాడు. ఈ వింతచేష్టకు కారణం అడగాలని లక్ష్మికి నోటివరకు వచ్చింది. కాని, కంగారుతో తనుచేసినపనికి తనే సిగ్గుపడి, ఊరుకుంది.

ఇంతలో ఈశ్వరుడు ఊరుకోక, విష్ణు మూర్తిని విశేషాలు చెప్పమని కోరాడు. అందుకు విష్ణువు "విశేషాలకేమున్నయి? ముక్తీశ్వరమనే గ్రామంలో రామయోగి అనే భక్తుడున్నాడు. అతడు 'మార్జాలకిశోర న్యాయం'గా నన్నే నమ్ముకొని ఉన్నవాడు.

'సంపన్నగృహస్థు' ఐనటువంటి ఆ రామ యోగి ఆవు యిప్పుడు కట్టుతెంచుకొని రైతు గురవయ్యపొలంలో పడింది. ఈ సంగతి గుర్తెరిగి, అతడు ఆవును వెతుక్కుంటూ ఊరంతా చుట్టబెట్టాడు. చివరకు ఊరి పొలిమేరకు పోయి చూడగా, అప్పటికే చేనులోపడిన ఆవును గురవయ్య చితక గొట్టటమూ, తరిమివేయటమూకూడా జరి గింది. రామయోగి వెళ్ళి గురవయ్యకు నీతులూ ధర్మాలూ బోధింపసాగాడు. గుర వయ్య మండిపడి, ఆవునుకొట్టిన కర్రతోనే రామయోగిని చితుకమోదాడు. ఒక్కొక్క దెబ్బ వంటిమీద పడినప్పుడల్లా రామయోగి 'నారాయణా! గోవిందా!! శ్రీహరీ!!!' అంటూ నన్ను స్మరిస్తూవచ్చాడు. ఆ పిలుపులు

జి. సుభద్ర - అనంతపురం

వినబడే నేను లేచి వెళ్ళాను.' అప్పుడు అందరూ ఆత్రంతో 'మరి, వెంటనే తిరిగి వచ్చేశారేమి?' అంటూ ప్రశ్నించాడు.

అందుకు విష్ణువు 'మంచిప్రశ్నేవేశారు. నేనువెళ్ళి రక్షించుదామనుకొనేటంతలోనే నా భక్తుడు ఓర్పిమిపట్టలేక రైతువానితో కలియబడ్డాడు. తమకంలో నన్ను స్మరించటమే మరిచి, 'మర్కటకిశోర న్యాయం'గా వర్తించాడు. కనుక, నాపని తీరిందికదా అని వచ్చేశాను," అనిచెప్పి ముగించాడు. ఎవరిళ్ళకు వారువెళ్ళారు.

ఇంత చెప్పినప్పటికీ లక్ష్మికి రామయోగి కథ సరిగా బోధపడిందికాదు. 'నాథా!- ఇందాక 'న్యాయం న్యాయం'అంటూ రెండు సార్లు ఉటంకించారే, అదియేమిటో నాకు తెలియచెప్పండి' అని కోరింది.

అప్పుడు విష్ణువు ఇలాచెప్పాడు: 'లక్ష్మి! భక్తుడైన రామయోగి మొదట్లో 'మార్జాల కిశోరన్యాయం'గా నన్ను నమ్ముకొన్నాడు. అనగా — పిల్లిపిల్ల తల్లినే నమ్ముకొని వుండటంచేత, తల్లి దానికి యెన్నడూ అపాయం కలగనీయదు. జాగర్తగా నోట కరచుకొని తీసుకపోతుంది. అలానే, నన్ను నమ్ముకొన్న భక్తుని మొర చెవినిపడగానే నేను ఆకస్మికంగా లేచివెళ్ళాను. కానైతే, అతడు రైతుతో కలియబడటంతో 'మర్కట కిశోరన్యాయం'గా వర్తించాడు. అనగా కోతి పిల్ల తల్లిని గట్టిగా కౌగిలించుకొంటుంది. అది తన చేతిపట్టునే నమ్ముకొంటుంది గనుక పట్టుసడలిందా, ఎప్పటికైనా దానికి అపాయమే. తనబలమే అది నమ్ముకోవటం చేత తల్లికి దాని బాధ్యత లేదు. అలానే, యిప్పుడు రామయోగి తనబలంచూచుకుని రైతుమీద కలియబడ్డాడు గనుక నేను పోయి రక్షించాలిసినభారం తప్పిపోయింది.'

భక్తులకూ భగవంతునికీ సంబంధించిన ఈ మహత్తర న్యాయాలు రెండూ తెలుసుకుని లక్ష్మీదేవి చాలా సంతోషించింది.



# ఫొటో వ్యాఖ్యల పోటీ



'చందమామ' తొలిసంచికనుండి అట్టలోపలి పేజీలలో రెండుఫోటోలు వేస్తూ వుండటం మీకందరకూ తెలిసినదే. ఈ ఫొటోలకు దిగువున, వాటికి సరిగా సరిపోయేటట్టు రెండు ఫొటోలకూ కలిపి వ్యాఖ్యలు ప్రచురిస్తూవచ్చాం. ఇకనుండి ఈ ఫొటోలకు వ్యాఖ్యలుకూర్చే అవకాశం మా పాఠకులకే యివ్వదలిచాం. సెప్టెంబరు సంచికలో వచ్చే ఫొటోలు ప్రక్క పేజీలో చూడండి. వీటికి సరియైన వ్యాఖ్యలు కావాలి. వివరాలు యివి:—

1. వ్యాఖ్య ఫొటోకు సరిపడేట్లు వుండాలి.
2. ముచ్చటైన ఒక్క మాటలోగానీ, రెండుమూడు మాటలుగల ఒకచిన్ని వాక్యంలోగానీ వ్యాఖ్య వుండవచ్చు.
3. అన్నిటికన్న ముఖ్యవిషయం: మొదటి ఫొటోకూ, రెండవ ఫొటోకూ కూర్చే వ్యాఖ్యలు రెండూ ఒకదానికొకటి సంబంధించివుండాలి.
4. ఒక్కొక్కరు ఒక్కొక్క సెట్టు వ్యాఖ్యలకంటే ఎక్కువ పంపకూడదు.
5. ఒక కార్డుపైన మీరు పంపదలచిన వ్యాఖ్య, మీ పూర్తిపేరూ, విలాసమువ్రాసి, మాకు పంపాలి.
6. జూలై 15-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకుచేరాలి. ఆతర్వాత చేరినవ్యాఖ్యలు పరిశీలించబడవు.
7. మాకుచేరిన వ్యాఖ్యలలోకెల్లా అత్యుత్తమంగావున్న సెట్టుకు (అనగా రెండు వ్యాఖ్యలకు కలిపి) రూ. 10/- బహుమతి యివ్వబడుతుంది.

వ్యాఖ్యలు పంపవలసిన అడ్రసు:—

: ఫొటో వ్యాఖ్యల పోటీ :

చందమామ పబ్లికేషన్స్

వడపలని పోస్టు :: మదరాసు - 26.

## ఒంటిగీత బొమ్మ




కె. కె. రాజుఆచారి - హుబ్లి

# అట్టమీది బొమ్మ

'తింటే గారెలే తినాలి, వింటే భారతమే వినాలి' అని తెలుగులో ఒక సామెత వున్నది. భారతం పంచమవేదముగా పరిగణింపబడుతూవుంది. ఇటువంటి మహత్తర గ్రంథాన్ని లోకహితార్థం వ్రాసి అర్పించాలెననే సంకల్పం వేదవ్యాసునికి ఒకప్పుడు కలిగింది.



ఐతే, భారతమంటే కాస్తా కూస్తా గ్రంథమా! అటువంటి బ్రహ్మాండమైన గ్రంథాన్ని వ్రాయడం ఒక్కళ్ళవల్ల నవుతుందా! కనుక, తను ఆలోచించి చెబుతూవుంటే అదంతా గ్రంథస్థంచేయగల సమర్థుడు ఎవడా అని జిజ్ఞాసలో పడ్డాడు. ఏమీ పాలుపోక, బ్రహ్మదేవుణ్ణి తలుచుకునేసరికి బ్రహ్మ ప్రత్యక్షమై, 'ఈ కార్యం నిర్వహించగల మొనగాడు వినాయకుడు ఒక్కడే. కనుక అతని సాహయ్యం పొందవలసింది' అని సలహాచెప్పి, అదృశ్యుడయ్యాడు.

అప్పుడు వ్యాసభగవానుడు వినాయకుణ్ణి తలుచుకోగా గణపతి ప్రత్యక్షమయ్యాడు. వ్యాసమహర్షి సంకల్పం వినగానే గణపతి 'మహానుభావా! నీ కోరికప్రకారం నేను భారతం వ్రాస్తాను. ఐతే, నేను ఘంటం చేతపట్టిందిమొదలు ఆగటానికి వీలులేదు. అంతటి ప్రవాహవేగంగా నీవు చెప్పగల్గితివంటే ఈపనికి పూనుకొంటా' నన్నాడు.

గట్టిచిక్కే వచ్చింది వ్యాసుడికి. దూరం యోచించినమీదట 'ఓయీ గణాధిపా!— చక్కటిమాట చెప్పావు. నీవు ఘంటం నడిపే గమనానికి తట్టుకొని నేను పాఠంచెబుతా. ఐతే, నీవుమాత్రం నేను చెప్పే ప్రతిమాటా అర్థం చేసుకు మరీ వ్రాయాలి సుమా' అని ఒకచిన్న అడ్డుపుల్ల వేశాడు.

వ్యాసుని చతురతకు గణపతి చిరునవ్వు నవ్వుకున్నాడు. ఇది లోకోద్ధరణకోసం తలపెట్టినకార్యమే అని తెలియనే తెలుసును గనుక, వ్యాసుడు అపూర్వమైన వాగ్ధరితో చెప్పుకొంటూపోగా, గణపతి నిండు సమ్మతితో మహాభారతాన్ని చకచక వ్రాసి గ్రంథస్థంచేసి, లోకానికి అర్పించి వంద్యుడైనాడు.

ఈ విధంగా మహత్తరమైనటువంటి పద్దెనిమిది పర్వాలలో మహాభారతం వ్యాసమహర్షిముఖతా లోకానికి ప్రసాదింపబడి, మానవ జీవితంలో అది ఎంతగానో ఉపయోగపడుతున్నది. జీవితం సార్థకం కావాలంటే మహభారతం చదివే తీరాలి.

# అట్టచివరి బొమ్మ

పేరొందిన మొఘల్ చక్రవర్తులలో ఖాసింఖాను అగ్రగణ్యుడు. అతని హయాంలో పర్షియాదేశం సస్యసమృద్ధమై వుండేది. నందనవనాలను ధిఃకరించే సుందరమైన పూలతోటలతో రాజ్యమంతా కలకల్లాడుతూవుండేది. ప్రపంచంలో మరెవ్వరికీ లేని భోగభాగ్యాలతో తులతూగే అదృష్టశాలి అని ఖాసింఖానుకు బిరుదువచ్చింది.

గానప్రియుడు, కళాభిమాని అయిన ఖాసింఖాను, రాజ్యంలోని విశాలమైన ఒక పూలతోటలో దివ్యభవనం నిర్మించుకుని, ముప్పొద్దులా అందులోనే కాలక్షేపంచేసేవాడు. అతడు నివసించే ఆ పూలతోటలో ఒకానొక బుల్‌బుల్‌పిట్ట వచ్చివాలి, ఒక చెట్టుకొమ్మపైన నివాస మేర్పరుచుకొన్నది. రోజూ అది పాడే పాటకు లోకం తన్మయతలో మునిగిపోయేది. ఎక్కడివాళ్లు అక్కడనే నిశ్చేష్టులై నిలబడిపోయి, ఆ మధురధ్వనివచ్చే దిక్కుకే దృష్టిసారించేవారు. ఆ సమయమందు ప్రాణికోటి హృదయంలో అది పాడే పాటకు తక్క మరివేనికీ చోటులేకపోయేది.



పర్షియా చక్రవర్తి ఆరామమూ, ఆరామములోని భవనమూ, భవనం సమీపంలో చెట్టుకొమ్మపైన బుల్‌బుల్‌పిట్ట చేసే గానమూ—ఇవి తిలకించేందుకు దేశదేశాలనుండి అశేషజనం వచ్చేవారు. వచ్చి, గానం విని ఆనందించేవారు. ఆ ఆనందాన్ని హృదయాలలో నింపుకొని వారివారి దేశాలకు కొనిపోయేవారు. అటు తరువాత, అదృష్టశాలి ఐన ఖాసింఖాన్ గురించీ, ఆరామంగురించీ, ముఖ్యంగా ఆరామంలోని బుల్‌బుల్ పిట్ట గానంగురించీ కవిత అల్లి గ్రంథాలు ప్రకటించేవారు. ప్రకటించిన ఆ గ్రంథాలు చక్రవర్తికి బహుమానంగా అందేవి. అవి అందుకున్నతరవాతనే, ఆయనకు తన పూలతోటలో ఇటువంటి చరిత్రప్రసిద్ధమైన ఒక బుల్‌బుల్ పిట్ట నివాసమేర్పరుచుకొని వున్నదనీ, మధురగానంతో లోకాన్ని తన్మయం చేస్తున్నదనీ తెలియవచ్చింది. 'ఏమిటీ చిత్రం! నా రాజ్యాన్నీ, నా ఆరామాన్నీ మించి, అంతగా లోకాన్ని ఆకర్షించేటట్టు గానంచేసే ఈ వింతపక్షిని గురించి నాకు కొంచెమైనా తెలియకపోయెనే, అదియేదో పట్టి తెచ్చి, యివాళ నా యెదట గానం చేయించండి, చూదాం' అంటూ చక్రవర్తి పరివారానికి ఆజ్ఞాపించాడు.

# ఇంద్ర

## చైనా కూజా

ఈ గారడి చేయటానికి అవసరమైనవి మామూలు చైనా కూజా ఒకటి, సన్నటి తాడుఒకటిన్ని. ఏడెనిమిది అంగుళాల యెత్తు కూజా, రెండు అడుగుల పొడుగు త్రాడు సరిపోతై.

ఐంద్రజాలికుడు ఈ త్రాడును ఒకవైపునుంచి కూజా లోపలికి పోనిచ్చి, ఆ కూజాను నాలుగైదుసార్లు అటూ యిటూత్రిప్పి, మంత్రిస్తాడు. అంత సులభంగా దూరిన త్రాడూ ఈకొసను పట్టుకుంటే ఆ కూజాలోపల 'టైట్'గా పట్టుకోపోయి ఉంటుంది. రెండోవైపున పట్టుకుని కూజాను అటూ యిటూ ఊగించినా, త్రాను ఊడిరాదు, కూజా క్రిందపడదు.



త్రాడును ప్రేక్షకులదగ్గిరనుంచే అడిగి తీసుకోవచ్చు. లేదా జేబురుమాలతోకూడా ఈ ఇంద్రజాలాన్ని చేయవచ్చు. కొంతసేపు ఆ త్రాడుపట్టుకుని కూజాను అటూ యిటూ ఊగించి, చివరకు త్రాడును బైటికిలాగి త్రాడూ, కూజా పరీక్షకివ్వవచ్చు.

ఇందులోవున్న కిటుకు ఏమిటంటే : ఐంద్రజాలికుడు ముందుగానే కూజాలో ఒక చిన్న రబ్బరుబంతిని వేసుకుని ఉంచుకోవాలి. ఆ రబ్బరుబంతి—ఆ త్రాడు—రెండింటి పరిమాణం—ఆ కూజామూతి లోపలి పరిమాణంకన్న హెచ్చుగా ఉండాలి. అలా ఉండటంవల్ల ఆ బంతిని కూజా లోపలికి త్రోసివేశాక, త్రాటిని దూర్చి—కూజాను తలక్రిందుగా త్రిప్పితే, లోపలి బంతి కూజాకంఠంమధ్యకు వచ్చి యిరుక్కుంటుంది. ఆ మధ్యలోవున్న ఈ సన్నత్రాడు దానంతటదే 'టైట్'గా బిగుస్తుంది.

# జాలము

అ త్రాడు కదిలించినప్పుడు కాస్త బిగిసినట్లు తోచగానే బంతివచ్చి కూజాకంఠంలో ఇరుక్కున్నట్లు గ్రహించాలి. ప్రక్కనున్న చిత్రంచూస్తే ఈ సంగతి ఇంకా స్పష్టంగా తెలుస్తుంది. రబ్బరుబంతి కూజా అడుగున యెలావుండేది మొదటిచిత్రంలో చూపబడింది. రెండో చిత్రంలో ఆ కూజాను క్రిందకు వంచితే అబంతి కూజాకంఠంలోకి వచ్చి ఎలా ఇరుక్కుంటుందో—త్రాడు కూజాకంఠానికి, బంతికి సందులో వుండి ఎలా బిగుస్తుందో చూపబడింది. మూడో చిత్రంలో త్రాడుపట్టుకుని కూజాను ఊగించేవిధానం



చూపబడింది—అంటే బంతి ఒత్తిడి వల్ల త్రాడు 'టైట్'గా బిగిసి, ఇహ కూజాను ఎంతఊగించినా క్రిందపడదు. నాలుగోచిత్రంలో మళ్ళీ అ త్రాటిని బైటికి లాగేటప్పుడు లోపలవున్న బంతి ఇంద్రజాలికుని చేతిలోకి ఎలావచ్చేదీ చూపబడింది. ఈ ఇంద్రజాలం ఇక్కడితో పూర్తి అయిందన్నమాట. ఇంద్రజాలికుడు తన చేతులోకి వచ్చిన బంతిని దాచేసి, ఈ కూజాను—త్రాటినీ పరీక్షకోసం ప్రేక్షకులకు ఇవ్వాలి.

---

ఈ గారడినిగురించి పాఠకులు ఇంకావివరంగా తెలుసుకోదలిస్తే, 'చందమామ' పేరు ఉదహరిస్తూ సరాసరి ప్రొఫెసరుగారికి వ్రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీషుభాషలోనే వ్రాయాలి. ఇదిముఖ్యం.

అడ్రెసు : ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్
12/3/A, జమీర్‌లేన్, బాలీగంజ్, కలకత్తా - 19



CHITRA

# పాఠకులకు ఒక ముఖ్య సూచన

*

'చందమామ' క్రొత్తభవనంలో ప్రవేశించిన శుభవార్తతోపాటు, క్రొత్త అడ్రసుకూడా అందజేసి, అదే అడ్రసుకు ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతూ ఉండవలసిందని లోగడ మా పాఠకులను కోరివున్నాము. అదేప్రకారం మా పాఠకులు (యింకా పాతఅడ్రసుకే వ్రాస్తున్న ఏకొద్దిమందో తప్ప) చాలమంది 'చందమామ పబ్లికేషన్స్, కోడంబాకం, మదరాసు - 24' అని వ్రాయటం అలవరచుకున్నారు.

అయితే—తలవనితలంపుగా, ఇంతలోనే ఈ అడ్రసుకూడా మారవలసివచ్చింది. తపాలాశాఖవారు ఈమధ్య చందమామ ఆఫీసుకు దగ్గర, (వడపలని) లో చందమామ, తదితర ఆఫీసుల సౌకర్యార్థం మరొక క్రొత్త పోస్టాఫీసు స్థాపించి, యికముందు ఉత్తరప్రత్యుత్తరాలన్నీ ఆ పోస్టాఫీసుద్వారానే జరగాలని సూచించారు. ఈ క్రొత్త పోస్టాఫీసు అడ్రసు 'వడపలని, మదరాసు - 26'

కనుక పాఠకులు ఇకనుండి 'చందమామ పబ్లికేషన్స్, వడపలని, మదరాసు - 26' అనే వ్రాయాలని కోరుతున్నాం. 'కోడంబాకం, మదరాసు - 24' అని మునుపటి అడ్రెసుకువ్రాసే ఉత్తరాలు ఎంతో ఆలస్యంగా చేరుతవి కనుక, యికనుండి ఈ క్రొత్త అడ్రసుకే వ్రాయటం మా పాఠకులకు చాలా అవసరం.

# చందమామలో క్రొత్తశీర్షిక



'చందమామ'లో కొంతకాలంపాటు "నేటి పాపలు–రేపటి పౌరులు" అనే శీర్షికక్రింద మా పాఠకులు పంపే ఫొటోలు ప్రచురిస్తూవచ్చాం.

అగస్టు నెలనుండి ఈ శీర్షికను తిరిగి ప్రారంభించదలిచాము. దీనినిగురించిన వివరాలు మా పాఠకులకు తెలిసినవే అయినా, తిరిగి జ్ఞాపకంచేస్తున్నాము.

★ పాఠకులు పంపే ప్రతి ఫోటోతోపాటు, ఆ ఫొటోను గురించిన వివరాలు (అంటే ఫొటోలోవున్న వ్యక్తిపేరు, వూరు, వయస్సు, ఫొటో తీసినవారి పేరు) వుండాలి.

★ ఫొటోలు కార్డుసైజుకి తక్కువకాకుండానూ, మరీ పెద్దవికాకుండానూ వుండాలి.

★ 'నేటి పాపలు–రేపటి పౌరులు' అనే శీర్షికక్రింద ఈ ఫొటోలు వీలు వెంట ప్రచురిస్తాము.

★ ఫొటోలతోపాటు మూడుకానుల పోస్టుబిళ్ల పంపాలి. మీరు పంపిన ఫొటోలు ప్రచురింపబడేటట్టయితే ఆవిషయం మీకు తెలియపరచేటందుకు గానీ, ప్రచురింపబడకపోయేటట్లయితే ఫొటోలు మీకు త్రిప్పిపంపటానికి గానీ యిది అవసరం.

★ ప్రచురింపబడిన ఫొటోలుగల చందమామ సంచిక ఒకటి ఫోటో పంపిన పాఠకునికి పంపబడుతుంది.

: ఫొటోలు పంపవలసిన అడ్రసు :

ఫొటోలన్నయ్య,

**చందమామ పబ్లికేషన్స్**

వడపలని పోస్టు :: మదరాసు - 26.

# విజయ

వారి చిత్రాలు

వినోదానికి

విజ్ఞానానికి

సాటిలేనివి




**VIJAYA PRODUCTIONS LTD.**

**Lessees of Vauhini Studios**

**MADRAS - 26**

Printed by B. NAGIREDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him from Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI CHAKRAPANI



Chandamama, July '52

Photo by T. Kasi Nath

అల్లుళ్లు

CHANDAMAMA (Telugu) JULY 1952 Regd. No. M. 4854




రంగులబొమ్మ కథ — 1 - వ బొమ్మ